చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

ప్రసిద్ధాంధ్ర కేంద్రములలో త్వరలో విడుదల కానున్నది!

పక్షిరాజా వారి



# 'పవళక్కొడి'

(తమిళం)

T. R. మహాలింగం - రాజకుమారి - వరదన్ - సరోజిని

N. S. కృష్ణన్ - మధురం - లలిత - పద్మిని

డైరెక్టర్ : శ్రీరాములు నాయ్డు

*Distributors for Andhra, Ceded and Nizams :*

**RAJASHRI PICTURES LTD.,**

VIJAYAWADA - GUNTAKAL - SECUNDERABAD

స్వర్ణోత్సవ వికాసము
నర్తనశోభ




పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము

ఆ జనప్రియా ఆరోగ్యమూర్తులు, నిశ్చింతగా మధురమయిన నర్తనలో పాల్గొని కాలము గడుపుతారు. ఆ జంట నాట్యమాడుటేగాదు, పరివర్తనములలో నిత్య వసంతోత్సవ శోభ వెల్లి విరిసేలా చేస్తారు. అర్ధ శతాబ్దముగా ప్రసిద్ధ బలవర్థక రసాయనముగా పేరొందిన "జీవామృతము" మీలోనూ ఆ ఉత్సాహ బలానందములు ప్రజ్వరిల్లేలా అవశ్యం చేయగలదు.

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
(స్థాపితము 1898)
మద్రాసు. 17

గ్యారంటి

# స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు

మాసిపోవు, ఎప్పుడు కాంతిగా నుండును.
చౌక, అందమైనవి.

లోటాలు, డబరా, టిఫన్ కారియర్లు, కప్పులు, అడుగుపెట్లు, స్పూనులు, ప్లేట్లు, పచ్చడి కిన్నం పెట్లు, జెల్లిగంపెలు, అన్నకుట్టి, వగైరా, వగైరా



ప్రతి యింటికి, హోటలుకు కావలసిన పరికరములన్నియు దొరకును. ఇవి అన్ని వ్యాపారుల దగ్గిర చిక్కును. మా షో రూమును సందర్శించండి 498, మింట్ స్ట్రీట్, మదరాసు, 3.

మాన్యుఫాక్చరర్లు:

ఇండియన్ మెటలర్జికల్




మెటల్ & కార్పొరేషన్

498, మింట్ స్ట్రీట్ మదరాసు, 3

# మంచి మంచి పుస్తకాలు

మా ప్రచురణలు అన్ని హిగిన్‌బాథమ్సు బుక్ స్టాల్సులోనూ దొరుకుతవి. లేదా మాకు వ్రాయండి. ఒకేసారిగా 6-0-0 పుస్తకాలు తెప్పించినవారికి పోస్టు ఖర్చులు మేమే భరించెదము. లైబ్రరీలకు, పుస్తక వ్యాపారులకు మంచి కమీషన్ ఇవ్వబడును. వివరాలకు వ్రాయండి.

## శరత్‌బాబు రచనలు

| | | | |
|---|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1 | 12 |
| శుభద | .. | 1 | 8 |
| దేవదాసు | .. | 1 | 8 |
| పల్లీయులు | .. | 1 | 8 |
| నవవిధాన్ | .. | 1 | 0 |
| చంద్రనాథ్ | .. | 1 | 0 |
| పరిణీత | .. | 0 | 12 |
| బడదీదీ | .. | 0 | 12 |
| పతివ్రత | .. | 0 | 12 |
| హేమాంగిని | .. | 0 | 12 |
| నిష్కృతి | .. | 0 | 12 |
| మావారు | .. | 0 | 12 |
| కాశీనాథ్ | .. | 0 | 12 |
| మహేశుడు | [కథలు] | 0 | 12 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0 | 12 |

## డిటెక్టివు నవలలు

| | | | |
|---|---|---|---|
| కరపటి మాట | [రాధాకృష్ణ] | 0 | 12 |
| మాయమైన మణిహారం | .. | 0 | 12 |
| తప్పిపోయిన పెళ్లికూతురు | .. | 0 | 12 |
| తగినశాస్తి | .. | 0 | 12 |
| పారిపోయిన యుద్ధఖైదీ | .. | 0 | 12 |
| దివాలా ఎస్టేట్ | .. | 0 | 12 |
| అంతులేని ఆశ | .. | 0 | 12 |

## చక్రపాణి అనువాదాలు

| | | |
|---|---|---|
| నాతిద్వేషి [మైత్రా] అనువాదం కథలు | 1 | 8 |
| పరాజయం .. .. .. | 0 | 12 |
| ఉదరనిమిత్తం [నాటకం] | 1 | 0 |
| వల్లభపురం చిట్టడవిలో [రాయ్‌చౌదరి] | 0 | 12 |
| హనుమంతుని స్వప్నం [పరశురాం] | 0 | 12 |
| మెట్టవేదాంతం [వనఫూల్] | 1 | 0 |
| బెంగాలీకథలు [మనోవైజ్ఞానిక కథలు] | 0 | 12 |
| ప్రగల్భప్రేతము [అత్యుత్తమ కథలు] | 0 | 12 |
| పాంచజన్యం [రాజకీయ కథలు] | 0 | 12 |
| డిటెక్టివు [నాటకం] | 0 | 12 |
| లంబకర్ణ [పరశురాం కథలు] | 1 | 0 |
| సంధి [యతీంద్ర మోహనసింహా] | 1 | 12 |

## కుటుంబరావు రచనలు

| | | |
|---|---|---|
| విలవనీరు [అత్యుత్తమ కథలు] | 1 | 8 |
| మొండివాడు .. | 1 | 0 |
| కాలభైరవుడు .. | 0 | 12 |
| వరప్రసాదం .. | 0 | 12 |
| కవిరాట్టు [గల్పికలు] | 0 | 12 |
| కులంలేని మనిషి [నవల] | 0 | 12 |
| అరుణోదయం .. | 1 | 0 |
| మారుపేర్లు .. | 0 | 12 |
| నీకేం కావాలి? .. | 0 | 12 |
| ప్రణయరోగులు [నాటకం] | 1 | 0 |
| అరితేరిన ఘటం (విదేశ కథలు) | 0 | 12 |
| రష్యన్ కథలు | 0 | 12 |

**యువ బుక్ డిపో**

పోస్టు బాక్సు నెం. **1686**, మద్రాసు, 1.




R. పద్మనాభన్ ప్రొడక్షన్స్ వారి,

# రక్షరేఖ

భానుమతి... అంజలిదేవి... నాగేశ్వరరావు... శివరావు...

డైరెక్షన్.. R. పద్మనాభన్.

SARMA / VS

*For Andhra, Ceded & Nizams*: **POORNA PICTURES**: VIJAYAWADA - GUNTAKAL - SECUNDERABAD

For Mysore : DELIGHT FILMS, Bangalore City - *Righ's Con'rolled by* : R PADMANABHAN, P. T. Madras.

## వచ్చుచున్నది!




డైరెక్టరు :
H. V. బాబు



స్టూడియో :
శోభనాచల

కృష్ణవేణి - ఋష్యేంద్రమణి - డా॥ సుబ్బారావు - రాళ్లబండి
లింగమూర్తి - సూర్యకాంతం - ఆరణి - సత్యవతి నటించిన

అద్భుత చిత్రము

*Sole Distributors :*

**CHAMRIA TALKIE DISTRIBUTORS**

**Madras – Vijayawada – Guntakal – Secunderabad**




సంపుటి 4
సంచిక 4

సంచాలకుడు: చక్రపాణి

ఏప్రిల్
1949

# ఉగాది పండుగ



మీకు శుభముల నిచ్చుగాత!

# అట్టమీది బొమ్మ

'కృష్ణుడు పుట్టి పెరుగుతున్నాడు' అని యోగమాయ చెప్పినప్పటినించీ కంసునికి గుండెలో గుర్రాలు పరుగులు పెడుతూనే వున్నాయి. ఎలా అయినా సరే కృష్ణుణ్ణి పట్టి చంపితేకాని తన ప్రాణగండం తప్పదని అతను నిశ్చయించుకున్నాడు.

ఆప్రకారం ఆనాడే భటులను పంపి గోకులంలో పుట్టి పెరుగుతున్న బాలురందరినీ చంపమన్నాడు. అలాగే భటులు పోయి గోకులంలో ప్రతి యిల్లూ వెతికి బాలకులందరినీ చంపారు. అయినా ఇంకెక్కడయినా దిగుబడి ఉంటారేమోనని కంసుడికి అనుమానం వేసింది.

అందుకని, పిల్లలను చంపటంలో నేర్పరి అయిన పూతనను ఈ పనికి నియమించాడు. పూతన పల్లెపల్లెలు వెతుక్కుంటూ, కంటపడిన శిశువులనందరనూ చంపివేస్తూ చివరకు, గోకులం చేరుకుంది. కృష్ణుడు నందుడి యింట్లో పెరుగుతున్నట్టు తెలుసుకొని, ఒక అప్సరస రూపంతో నందుని ఇంట ప్రవేశించింది. మామూలు మానవ స్త్రీ లాగనే కనబడటంచేత, ఆమెను ఎవరూ అడ్డుపెట్టలేదు.

"అమ్మా, నా ముద్దుల కృష్ణుడేడీ! చిన్నారి కృష్ణుడేడీ!! ఒక్కసారి ఎత్తుకోనీయండమ్మా!!!" అంటూ పూతన శిశువును అభిమానంతో ఒడిలోకి తీసుకొని, ఎంతో ప్రేమతో తన విషపురొమ్ములతో బాలునికి పాలివ్వ నారంభించింది.

ఇంట్లోవాళ్ళు తెలుసుకోలేక పోయారు గాని, కేవలమూ పరమాత్ముడే అయిన కృష్ణునివద్ద పూతన మాయలు పనికివస్తాయా?—పూతన పాలు తాగుతూవున్న మాయల కృష్ణుడు, పాల ధారలతోపాటు ఆమె జీవధారలను కూడా పీల్చివేశాడు.

మరణవేదన భరించలేక, 'అమ్మోయ్, బాబోయ్!' అంటూ పూతన, భూమీ ఆకాశమూ దద్దరిల్లేటట్టు బొబ్బలెట్టుకుంటూ, నిజరూపంతో పర్వతం లాగ నేలని కూలింది. ఆ పెద్ద కళేబరంపయిన కూర్చుని, భయంలేకుండా బాల కృష్ణుడు ఆడుకొంటున్నాడు. అప్పుడు అందరూ, ఆ అప్సరస పూతన కదా అని పోల్చుకొని, బాలకృష్ణుని అద్భుత లీలలకు ఆశ్చర్యపోయారు.




ఇక్కడ వున్న తొమ్మిది బొమ్మలూ అన్నీ అన్ని రకాలుగా ఉన్నట్టు కనిపిస్తున్నయ్యి కదూ? కాని, నిజంగా అలా లేవు. తొమ్మిదింటిలో రెండు బొమ్మలు అచ్చగా ఒకే మాదిరివి వున్నయ్. ఆ రెండూ ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి 51-వ పేజీ చూడండి.




కన్నయ చెట్టి సత్రములో
చిన్నిరాజు బస చేశాడు;
దివానుగా రా రాజాతో
సవాళ్లు దీస్తున్నా డేవో.
ఇంతలోన జోస్యము చెప్పే
కంతిరి శాస్త్రిలు వచ్చాడు;
రాజావారి బంట్రోతుల్
రత్నకంబళము పరిచారు.
శాస్త్రిలు నవ్వుతు గూర్చుండి,
చంక గ్రంథ మటు పెట్టాడు;
చొరవ చేసుకొని రాజాతో
జోస్యము చెప్తా నన్నాడు.
రాజావా రూకొడుతుంటే,
రవ్వలు రాలిపి పోశాడు;
చివరకు రా జెనుబది యేండ్లే
జీవిస్తాడని పలికాడు.

దిగులు పుట్టి రాజావారు
దివాను వంకకు చూచాడు.

దివాన్

"తమ రెన్నేడులయా! జీవి
స్తారో సెలవి" మ్మన్నాడు.

జోస్యులు

"అయ్యగారికంటే పది రెం
డ్లదన" మ్మనుకోమన్నాడు,

*  *  *

మంతిరి బాకటు దూశాడు,
కంతిరి తల దెగవేశాడు.
కలవరపడి రాజావారు
పులుకు పులుక్కున చూస్తుంటె

దివాన్

"లభంగు వెధవల జోస్యము లీ
లాగుంటవి పో"మ్మన్నాడు.

రచన: 'ఏటుకూరి'




క్రిందటిసారి 'ప్రొద్దుతిరుగుడు పువ్వు' కథలో సూర్యమహారాజును గురించి కొన్ని చిత్రాలు విన్నాము—ఆయన కోట ఒకటి తూర్పుదిక్కున ఉన్నదనీ, ఆ మహారాజు ప్రతిరోజునా ఉదయానే ఏడుగుర్రాల రథంమీద బయలుదేరి, ఆకాశం మధ్యగా పడమటిదిక్కుకు షికారు పోతూవుంటాడనీ.

సూర్యమహారాజు కోటలు చాలా అందమైనవి. వాటి ద్వారాలూ, తలుపులూ విలువయిన చక్కటి మంచిముత్యాలతో తయారయినవి. ద్వారాల తలుపులు తెరిచేందుకూ, మళ్లీ మూసేందుకూ సుందరమైన ఒక దేవకన్య అక్కడ ఉంటుంది.

ఆ దేవకన్య ధరించే జరీదుస్తులు ధగధగ మెరిసిపోతూ వుంటాయి. ఆమె జుత్తు పొడవుగా, అందంగా, బంగారు ఛాయతో నిగనిగలాడుతూ వుంటుంది. ఆమె మంచి మనస్సు కలది. అందుకని, ఆ దేవకన్యను చూస్తే అందరూ అభిమానం చూపుతారు. మానవులూ, దేవతలుమాత్రమే కాదు, నోరులేని జంతువులు, పక్షులు, వృక్షాలు కూడా ఆమెపైన ప్రేమ కలిగివుంటాయి.

మహారాజుగారి కోటలో ఆ దేవకన్య చేయవలిసిన పని ఒక్కటే: ఉదయాన్నే మహారాజు బయలుదేరేటప్పుడు రథం వెళ్లటానికి తూర్పుకోటద్వారాలు తెరవడం, వారు వెళ్ళగానే మూసివేయడం. మళ్లీ సాయంత్రంవరకు ఆమెకు మరేపనిలేదన్న మాట. రోజు రోజంతా పగటిపూట ఆమె యిష్టం వచ్చిన చోట తిరిగి రావచ్చు.

సాయంకాలం అయేసరికి సూర్యమహారాజు షికారు పూర్తిచేసుకొని, పడమటి దిక్కున ఉంటాడుగా? మరి, ఆయన రథం పడమటి దిక్కున ఉండే కోటలోకి పోవటానికి అక్కడి ద్వారాలు తెరవాలి. అందుకోసం సాయంకాలం అయేసరికి

పి. విశ్వనాథశాస్త్రి, బరంపురం.




దేవకన్య పడమటి దిక్కున సిద్ధంగా కనిపెట్టుకుని ఉండాలి. ఇప్పుడు కోట ద్వారాలు మూసివేస్తే మళ్లీ మరునాడు ఉదయంవరకూ ఆమెకు పనిలేదు.

తీరికసమయంలో దేవకన్య భూలోకానికి వచ్చి, నదీతీరములవెంటా, అరణ్యములవెంటా తిరిగేది. ప్రకృతిలో అందచందాలు చూచి అనందించి, వేళ తప్పకుండా తన విధిని నెరవేర్చుకునేందుకు మళ్లీ కోటకు వెళ్లిపోతూ వుండేది.

ఒకరోజున ఆమె ఇలాగే భూలోకానికి వచ్చి అడవిలో సంచరిస్తుండగా, వనరాజు ఆమెను చూచి "ఓహో! ఈమె ఎంత చక్కనిది!! ఇటువంటి సుందరిని నేను ఎన్నడూ చూడలేదు. ఈమెను పెళ్లాడితే ఎంత బాగుండును!" అనుకొన్నాడు.

ఈ వుద్దేశం ఆమెతో చెప్పేసరికి, దేవకన్యకూడా అందుకు ఇష్టపడింది. కాని, ఆమె పెళ్లి చేసుకుని వనరాజుతో భూలోకమందు ఉండిపోయినట్టయితే అక్కడ ఉదయమూ, సాయంకాలమూ సూర్యమహారాజుగారి కోటద్వారాలు ఎవరు తీస్తారు? అందుకని, ఆమె వనరాజును పెళ్లాడినప్పటికీ ఆయనతో ఉండిపోవటం మానేసి, రోజూ తీరిక వేళలలో వచ్చి భర్తసేవ చేసుకొని పోతూవుండేది.

ఇలా వుండగా, ఒకనాడు దేవకన్య వచ్చి చూచే సమయానికి వనరాజుకు అకస్మాత్తుగా జబ్బుచేసింది. అతను ఒక చెట్టు కింద కటికనేలపయిన పడుకొనివున్నాడు. ఆమెకు భర్తనుగురించి బెంగపట్టుకుంది. "నా భర్త భూలోకంలోనూ నేను దేవలోకంలోనూ చెరివొకచోటా ఉండటంవల్ల ఆయనను నేను సరీగా కనిపెట్టి ఉండటానికి వీలుగాకున్నది. పోనీ, నేను సూర్యమహారాజుగారి కొలువువదిలి భూలోకంలో

ఉండిపోదామంటే, అదీ అసలే వీలుకాదు. కనుక నా భర్తనే దేవలోకంలోకి తీసుకు పోయే ఏర్పాటు ఆలోచించాలి" అనుకుంది.

ఈ నిశ్చయంతో ఆమె దేవతల అధిపతి వద్దకు వెళ్లి "దేవేంద్రా! నా భర్త ఐనటువంటి వనరాజు భూలోకమందు ఉండిపోవటంచేత ఇక్కడ నాకేమీ తోచకుండా వున్నది. ఆయనకూడా నాతో ఉన్నట్టయితే, నా మనస్సుకి ఉత్సాహంగా ఉంటుంది. అందుచేత నాపైన దయవుంచి, మేము ఇద్దరమూ ఇక్కడనే కలిసి ఉండటానికి అనుమతి ఇప్పించవలిసిం" దని కోరింది.

ఇందుకు దేవేంద్రుడు ఒప్పుకోగానే, మరునాడు ఆమె వనరాజును దేవలోకం లోకి తెచ్చుకుంది. దేవలోకంలో ఉండే వాళ్లకు ముసలితనం రాదుట, చావులేదుట.

అయితే తన భర్త దేవలోకంలో ఉండటానికి మాత్రమే దేవకన్య అనుమతి కోరిందికాని, అతనికి తమవలె ఎప్పటికీ ముసలితనం రాకుండా చేయాలని కోరుకో లేదు. అందుకని దేవకన్య, వనరాజూ కలిసి దేవలోకంలో చాలాకాలం హాయిగా ఉన్నప్పటికీ, భూలోకంలో నివసించే అందరకులాగనే వనరాజుకు కూడా



కొంతకాలానికి ముసలితనం వచ్చేసింది. భర్త ముసలివాడుగా మారిపోయి నప్పటికీ, దేవకన్య ఎప్పటిమోస్తరుగా భక్తి శ్రద్ధలతో పతిసేవ చేస్తూనేవుంది. ఎంత చేసినా, అతని ముసలితనాన్ని మాత్రం ఆటంకపరచటానికి ఆమెతరం కాలేదు.

క్రమంగా వనరాజుకు చేతికి కర్ర వచ్చింది. ఒళ్ళంతా ముడుతలు పడటం, పళ్లు ఊడిపోవటం, కళ్లు కనపడకపోవటం, కంఠస్వరం హీనమవటం—ఇలాటి ముసలి లక్షణాలన్నీ కలిగాయి. చివరకు ఒకనాడు అతను భార్యను పిలిచి, "నాకు ఆఖరుదశ వచ్చేసింది. నేను పుట్టి పెరిగిన భూలోకానికి పోయి, పరుపులాగ ఉండే ఆ పచ్చటి గడ్డిలో పడుకుని, విశ్రాంతి తీసుకుందామనే కోరిక ఒక్కటే నాకు మనస్సులో మిగిలివున్నది. నన్ను తీసుకుపోయి అక్కడ దిగబెట్టవలిసింది" అన్నాడు.

భర్త ఇష్టము నెరవేర్చటమూ, అతనికి అనుకూలముగా నడవటమూ ఆమె ముఖ్యమని తలచింది. "మీ సంతోషమే నా సంతోషము. నా పొరపాటువల్ల మీకు ముసలితనం రాక తప్పిందికాదు. కానైతే, భూమిపైన ఉన్నప్పటికీ, నాతోపాటు మీరూ శాశ్వతంగా జీవించవలిసిందేకాని, మరణించకూడదు. మీకు పచ్చగడ్డిలో ఉండటం హాయిగా వుంటుందన్నారు గనుక అక్కడనే మీకు సౌఖ్యంగా ఉండేటట్టు చేస్తాను" అని చెప్పి, అమె తన భర్తను తూరీగగా మార్చివేసింది.

ఈనాడుకూడా దేవకన్య, తూరీగ రూపంలో వుండే భర్తను చూడటానికి రోజూ భూలోకానికి వస్తూనే వుంటుంది. అందుకనే, పతిభక్తి గల దేవకన్య కంటికి కనపడినప్పుడెల్లా, తూరీగ ఉత్సాహంతో ఎగిరి ఆకాశంలో తిరుగుతూ వుంటుంది.






అక్కడ ఢిల్లీలో, తన విడిదిలో, నవాభోజ రాజు సుఖనిద్రలో ఉన్నాడు. ఆయనకు వీపుమీద ఎవరో చరిచినట్లైంది: "లేవయ్యా, లే! నీ బిడ్డల్ని అడివిపాలుచేసి ఇక్కడ హాయిగా నిద్రపోతున్నావా?" అనే మాటలు ఆయన చెవులలో గింగురుమన్నాయి.

రాజు ఉలిక్కిపడి లేచాడు. ఎన్నడూ కనిపించని లక్ష్మమ్మ కలలో కనిపించింది, బిడ్డలకేదో అయిందనుకున్నాడు. జమా ఖందిపని మంత్రులకు వదిలి, త్వరగా పిల్లలందరికీ బట్టలూ, నగలూ, తినుబండారాలూ, బొమ్మలూ కొనుక్కొని ఢిల్లీరాజుకు కబురైనా చెయ్యకుండా నవాభోజరాజు ఇంటికి వచ్చేశాడు. ఢంకామోతవిని పిల్లలు ఎదురురాకపోయేసరికి ఆయనకు ఆరాటం మరింత హెచ్చింది. మాణిక్యాలదేవి ఇంటికి వెళ్లాడు. ఆవిడ ఇంట్లో ఒంటరిగానే వుంది.

"పిల్ల లేరీ?" అని అడిగాడు రాజు.

"పిల్ల లేరీ అని అడుగుతున్నారా? మీ మొదటిభార్యగారు వచ్చి, ఇంట్లో కుండలన్నీ పగులగొట్టి, నా శరీరమంతా రక్కి పిల్లలను తీసుకుని వెళ్లిపోయింది" అన్నది మాణిక్యాలదేవి. లక్ష్మమ్మకు మాట ఇచ్చి కూడా తాను తిరిగి పెళ్లాడినందుకు కోపం వచ్చి ఆమె పిల్లల్ని తీసుకుపోయింది కాబోలు అనుకున్నాడు రాజు.

వాళ్ళకోసం దేశమంతటా వెతికించాడు. దొరకలేదు. చివరకు తానే పల్లకీఎక్కి వెతకటానికి బయలుదేరాడు.

అట్లా వెతుకుతూ అడవిని పడిపోగా ఒకచోట అడుగులజాడలు కనిపించాయి. ఏడు జతలు చిన్నపాదాల గుర్తులూ, ఒక జత పెద్దపాదాల గుర్తులూ అగుపించాయి. ఆ ఏడుగురూ తన పిల్లలనీ, ఎనిమిదో మనిషి లక్ష్మమ్మ అనీ, మాణిక్యాలదేవి నిజమే చెప్పిందనీ, ఈ గుర్తులవెంట పోతే



పిల్లలు దొరుకుతారనీ రాజుకు తోచింది. ఆ గుర్తులు పాడుపడిన దేవాలయం దాకా వచ్చి ఆగిపోయాయి. దేవాలయానికి తాళాలువేసి ఉన్నాయి. ఈగుడికి తాళాలు ఎవరు వేస్తారా అని సందేహం తోచి రాజు తాళాలు పగులగొట్టించి లోపల ప్రవేశించే సరికి కొనప్రాణాలతో తన యేడుగురు బిడ్డలూ కనిపించారు. వాళ్లను పల్లకీలో యెక్కించుకుని రాజు యింటికి తిరిగి వచ్చాడు. మారుతల్లి తమకుచేసిన దుర్మార్గమంతా పిల్లలు తండ్రికిచెప్పేశారు. రాజుకు మాణిక్యాలదేవిమీదకోపంవచ్చి, ఆమె ఇంటి ముఖం చూడక, తన పిల్లలకు అన్నీ తానే చేసుకుంటూ యెప్పటిమాదిరిగా ఉన్నాడు.

రాజుని ఎట్లాగయినా తనవలలో వేసుకొన వలెనని మాణిక్యాలదేవి అడవిలో ఏవో ఆకులు తెప్పించి, పసర్లు పిండించి, రాజు స్నానంచెయ్యటానికి వెళ్లివున్న సమయంలో, ఆయన వంటలో ఈ పసర్లు కలిపించింది. రాజుగారు భోజనంచేసి పడుకోగానే మాణిక్యాలదేవిమీద వెర్రిమోహం పుట్టుకొచ్చి నిలువలేక పోయినాడు. పిల్లలు నిద్రపోతున్నారు. రాజు మాణిక్యాలదేవి మేడకు వెళ్లి తలుపుతట్టాడు. మాణిక్యాలదేవి తలుపు తియ్యాక, "నీ పిల్ల లుండగా నీకు నేనెందుకు? వాళ్లను చూసుకునేగదా నన్ను వొదిలేశావు. వాళ్ళందరి గొంతులూ కోసిరా, అప్పుడు తలుపుతీస్తాను" అన్నది.

"అయ్యో! ఎవరయినా కన్నబిడ్డల గొంతులు కోసుకుంటారా?" అన్నాడురాజు.

"ఐతే వాళ్లను నట్టడవిలో విడిచేసిరా. నీకు వాళ్లన్నా ఉండాలి, నేనన్నా ఉండాలి" అన్నది మాణిక్యాలదేవి. ఆమె మీద కొత్తగా పుట్టిన మోహంలో, రాజు తన బిడ్డలను అడివిపాలుచెయ్యటానికి సిద్ధపడ్డాడు. ఇంటికి వెళ్లి పిల్లలను లేపి, "అమ్మా!

లెండే, మనం మీ మేనమామల యింటికి పానుగంటి పట్నానికి పోదాం" అన్నాడు.

"మనకు మేనమామలెవరున్నారు? ఎప్పుడూ వినలేదే?" అన్నారు పిల్లలు.

"పదేళ్లుగా వాళ్లకీ మనకీ మాటలులేవు. మీ అమ్మపోయింది కనక మనం ఒకసారి వెళ్లి వాళ్ళను చూసొస్తే బాగుంటుంది" అన్నాడు రాజు. పిల్లలు సరే నన్నారు.

రాజు పిల్లల్ని అడవిలో విడిచిపెడుతున్నాడని తెలిసి, సంతోషంతో మాణిక్యాలదేవి పిల్లలు ఏడుగురికీ విషంపెట్టిన ఏడు రొట్టెలు తయారుచేసింది. రాజుకు వేరే అన్నంమూట కట్టింది. పిల్లల రొట్టెలను రాజును తినవద్దన్నది. తింటే తనకు రొట్టె తక్కువైందని యెవరో ఒకరు నిష్కారణంగా ఏడుస్తారు. తన భోజనం పిల్లలకు పెట్టవద్దన్నది. ఒకరికి పెడితే అందరికీ పెట్టాలి; రాజుకు చాలదు. ఈ మాయ మాటలు నమ్మి, రాజు సరేనన్నాడు. తండ్రి ముందూ, పిల్లలు వెనకా బయలుదేరారు.

ఊరుదాటారు. బాలనాగమ్మ దారిలో ఒక కాకినిచూసి సరదాకు తన ఒళ్లోవున్న రొట్టె కొంచెం తుంచి వేసింది. అముక్క తిని, కాకి అక్కడే గిల, గిల తన్నుకు చచ్చింది.





బాలనాగమ్మ ఆశ్చర్యపడి మరో ముక్క తుంచి కుక్కకు వేసింది. అది తిని కుక్క కూడా చచ్చింది.

"అయ్యో, ఈ రొట్టెల్లో విషం ఉంది. ఇవి తింటే మనం చస్తాం. ఎక్కడన్నా పారేస్తే యితరజంతువులు తిని చస్తాయి. ఆ పాపం మనకు చుట్టుకుంటుంది. అందుకని అందరి రొట్టెలూ, గొయ్యి తీసి, గోతిలో పూడ్చేద్దాం"అన్నది బాలనాగమ్మ.

ఏడుగురు పిల్లలూ తమ తమ రొట్టెలు మట్టిలో పూడ్చి యిసుక కప్పి దిమ్మస చేసి ముందుకు సాగారు.

మరి కొంతసేపటికి వాళ్ళు అడవిలో ప్రవేశించారు.

కొంతదూరం పోగా పోగా బాలనాగమ్మకు ఆకలి వేసి నడవలేకపోయింది. ఆసంగతి తన అక్క సూర్యనాగమ్మతో చెప్పింది. ముందు పోతున్న తండ్రిని కలుసుకుని సూర్యనాగమ్మ, "నాన్నా, చెల్లెలు బాలనాగమ్మ ఆకలికి నడవలేకుండా ఉంది. నీ మూటలో అన్నంకొంచెం పెట్టు, పాపం" అన్నది.

"ఈ మూటలోది అన్నం కాదమ్మా. దారిలో ఎలుగుబంట్లు వస్తే తరమటానికి మూడు ఇటుక రాళ్లు కట్టుకున్నాను. పానుగంటికి వచ్చేశాంలే. కొంచెం ఓపిక పట్టి నడవమని చెప్పు" అన్నాడు నవాభోజరాజు.

కాని బాలనాగమ్మ కూర్చుని లేవలేక పోయింది. తండ్రికి కోపంవచ్చి దగ్గిర వున్న చెట్టుకొమ్మ విరిచి బాలనాగమ్మను రెండు కొట్టాడు.

"దాన్ని యెందుకు కొడతావు, నాన్నా! బాలనాగమ్మ నడవలేకపోతే మేము ఎత్తుకొస్తాం లే" అని మిగిలిన అరుగురూ ఆమెను మోసుకు నడవసాగారు.



ఇంతలో పొద్దుకూకింది.

"అర్ధరాత్రివేళ పోతే మనల్ని ఎవరూ గుర్తుపట్టరు. అంతా నిద్రపోతూ ఉంటారు. అందుకని ఈ రాత్రి అడవిలోనే పడుకుని తెల్లవారి మీ మేనమామల ఇంటికిపోదాం" అన్నాడు రాజు. అందరూ పడుకున్నారు. తండ్రిని మధ్యలోపెట్టుకుని పిల్లలు అటూ ఇటూ పడుకున్నారు. ఆకలితో అర్ధరాత్రి దాకా యెవరికీ నిద్రపట్టలేదు.

పిల్లలంతా నిద్రపోగానే రాజు లేచి తన స్థానంలో ఒక బూరుగదుంగను పెట్టి, దానికి తన తలపాగా చుట్టి, మీద ఒక గుడ్డ కప్పి, తిరిగి తన పట్టణానికి బయలు దేరాడు. కొంతదూరం వచ్చాక తూర్పు తెల్లవారసాగింది. ఒకచెరువుదగ్గిర మొహం కడుక్కొని తాను తెచ్చుకున్న అన్నం తినటానికి మూటవిప్పిచూసేసరికి అందులో మూడు ఇటుకరాళ్లే ఉన్నాయి.

"ఎంత పాపకర్ముణ్ణి! పిల్లలకయినా పెట్టకపోతినే!" అనుకుంటూ రాజు ఇంటికి తిరిగిపోయి, పిల్లలను మరచి మాణిక్యాల దేవితో సుఖాలలో ఓలలాడ సాగాడు.

ఇక్కడపిల్లలు తెల్లవారుతూనే లేచారు. తండ్రినిపిలిచారు. పలకలేదు. తట్టిలేపారు.



తండ్రికిబదులు బూరుగ దుంగఉండటం చూశారు. తమతండ్రి చచ్చి దుంగ అయి పోయినా డనుకుని ఏడిచారు. తరువాత ఆ దుంగను పట్టుకెళ్లి దహనంచేసి ఒక చెరువులో అందరూ స్నానాలు చేశారు. అందరికీ ఆకళ్ళు మండిపోతున్నాయి. ఎటుచూసినా అరణ్యం. పాపం! వాళ్ళకి దారి తెలియదు.

ఈ సమయానికే పానుగంటి రామవద్ది రాజు ఆ అడవికి వేటకు వచ్చాడు. ఆయన పరివారానికి ఈ యేడుగురు పిల్లలూ దొరి కారు. "అయ్యో! పాపం, ఎవరో పసివాళ్లు, ఏడుగురు ఆడపిల్లలు ఆకలికి తపించుకు పోతూ ఇక్కడ వున్నా"రని భటులుచెప్పగా వేటకు వచ్చిన రాజు వారిని చూచి వారి కథంతా విన్నాడు. వాళ్ళు తన చెల్లెలయిన లక్ష్మమ్మ పిల్లలే నని ఆయనకు వాళ్ల మాటలనుబట్టి తెలిసింది.

రామవద్దిరాజుకు ఏడుగురు కొడుకులు. రామవద్దిరాజు మేనకోడళ్లను తన వెంట పానుగంటి పట్నానికి తీసుకుపోయి వారిని తన ఏడుగురు కొడుకులకూ యిచ్చి మహా వైభవముగా పెళ్ళి చేసుకున్నాడు. అందరి లోనూ ఆఖరువాడైన కార్యవద్దిరాజుకు బాలనాగమ్మ నిచ్చారు.

* * *

ఈసమయానికే నవాభోజరాజుకు చెడ్డ రోజులు వచ్చాయి. జమాబందికి వచ్చిన వాడు తనను చూడకుండా, కిస్తీ చెల్లించ కుండా తిరిగి వెళ్లిపోయినా డని ఢిల్లీ పాదు షాకు కోపం వచ్చింది. సైన్యాలను పంపి నవాభోజరోజు ఆస్తి జప్తు చేయించాడు. ఆయనను ప్రభుత్వంనుంచి తీసివేశాడు.

మాణిక్యాలదేవితోపాటు నవాభోజ రాజుకూ ఇల్లూవాకిలీ లేకుండా పోయింది. కొంతకాలంపాటు వారూ వీరూ తిండి



పెట్టారు. నవాభోజరాజు పాదుషాకు ఎన్నో అర్జీలు పంపాడుగాని, పాదుషా వాటికేసి చూడలేదు.

"మనరోజులు బాగాలేవు. ఏలిన ఊళ్లో కూలి చేసుకోలేము. ఎక్కడికయినా వెళ్లిపోదాం" అన్నాడు నవాభోజరాజు భార్యతో.

ఇద్దరూ అడివినిపడి పానుగంటి చేరారు. అడవిలో కట్టెలేరుకుని పానుగంటిపట్నం వీధుల్లో అమ్ముకుని, సాయంకాలానికి ఒక మర్రి చెట్టు దగ్గిర కలుసుకుందామని యేర్పాటుచేసుకున్నారు.

రాజు ఒక వీధివెంట సాగాడు. మాణిక్యాలదేవి మరోవీధిన పడింది. తమ ఇంటి ముందుగా "కట్టెలు, కట్టెలు" అంటూ రాజు వెళుతుంటే పిల్లలు తండ్రిగొంతువిని ఆశ్చర్యపడ్డారు. పిలిపించి నువ్వెవరని అడిగారు. తమతండ్రే అని తెలిసి ఆయనచేసిన మోసం అప్పుడు గ్రహించారు. కాని ఆయన కష్టంలో ఉండటంచూసి జాలిపడి లోపలికి పిలిచి భోజనంపెట్టి గౌరవించారు.

సాయంకాలం కాగానే మాణిక్యాలదేవి మర్రిచెట్టు క్రిందికి వచ్చి భర్తకోసం చాలాసేపు చూచింది. ఎంతకూ ఆయన రాలేదు. "ఈ మగవాళ్ళను నమ్మరాదు. తాను సంపాదించిన సోలెడుగింజల్లో నాకు పెట్టవలసివస్తుందని మొహంతప్పించాడు" అనుకొని మాణిక్యాలదేవి ఊరికి ఉత్తరంగా పడి ఎక్కడికో వెళ్లిపోయింది.

* * *

కొని రాజు ఎంతోకాలం బ్రతకలేదు. మరి మాణిక్యాలదేవి పెట్టిన మందులు ఊరికే పోతాయా? ఆయన ఆరోగ్యం పూర్తిగాచెడింది. ఆయనశరీరం ఉబ్బింది. కదలలేదు. మంచానకూడా పడ్డాడు. ఎన్ని చికిత్సలు చేసినా లాభం లేకపోయింది. ఆఖరుకు ఆయన తన కూతుళ్ళ చేతుల

మీదుగానే చనిపోయాడు. అయనకు దహన సంస్కారం, ఉత్తరక్రియలు చక్కగ జరిగాయి.

* * *

కొన్ని సంవత్సరాలు గడిచినవి. బాల నాగమ్మా, ఆమె ఆరుగురు అక్కలూ భర్తలతో సంసారంచేస్తూ హాయిగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు. బాలనాగమ్మ అక్కలకు ఇంకా సంతానం కలగలేదు. కాని, బాలనాగమ్మకు గర్భచిహ్నాలు కని పించినవి. ఈవార్త ఆమె అక్కలకే కాదు, బావలకూ, భర్త కార్యవద్ధిరాజుకూ ఆనందం కలిగించింది. పానుగంటి పట్టణం చక్కగా అలంకరించి ఉత్సవాలు చేశారు. బీదలకు అన్నదానం చేశారు.

* * *

ఇంతలో సూర్యవద్ధిరాజూ, అతని ఆరుగురు తమ్ములూ ఏదో అవసరమైన పనిమీద గండికోట వెళ్లవలసి వచ్చింది. ఏడుగురూ ముస్తాబయినారు. పల్లకీలు వచ్చి వాకిట సిద్ధంగా ఉన్నాయి. వాళ్లు తలారిరాముణ్ణి పిలిపించి, "ఒరే, ఎవరైనా జోగులూ, జంగాలూ, బ్రాహ్మలూ, పరదేశీయులూ యాచనకువస్తే బియ్యమూ, పప్పూ యిప్పించి పంపు. కాని యెవరినీ కోటలో అడుగుపెట్ట నివ్వకు. ఎవరయినా లోపల అడుగుపెడితే నీ బుర్ర తీయిస్తాం, జాగర్త!" అని చెప్పారు.

బాలనాగమ్మ పెనిమిటిఅయిన కార్య వద్ధిరాజు, గర్భిణిగా ఉన్న తన భార్యతో, "మన తలవాకిట ఏడు గిరులు గీశాను. నేను తిరిగి వచ్చేవరకూ నువు పొరపాటున కూడా ఈ ఏడు గిరులూ దాటి వెళ్ళవద్దు" అని చెప్పాడు.

ఆ తరవాత ఏడుగురు అన్నదమ్ములూ పన్నెండువేల పరివారంతో గండికోటకు ప్రయాణమై పోయినారు. [ఇంకా వుంది]






# బాదరాయణ సంబంధం

అనగా అనగా ఒక వూళ్లో అప్పంభొట్లు అనే బ్రాహ్మడు ఉండేవాడు. ఆయన ఒకనాడు ఉదయాన్నే చద్దన్నం తిని, దూరపు గ్రామంలో వుండే బంధువులను చూచి వద్దామని బండిమీద బయలు దేరాడు.

మిటమిటలాడే మండుటెండలో మధ్యాహ్నం రెండు ఝాములయేసరికల్లా ఆయన ఒక గ్రామం చేరుకొన్నాడు. చూడబోతే బంధువుల వూరు చేరటానికి ఇంకా నాలుగు కోసు లున్నదాయె. పొద్దుటనగా తిన్న చద్దన్నం అరిగిపోయి, కడుపులో నకనక ఆకలవుతున్నది. మరి, భోజనం మాట ఏమిటి? ఆ చుట్టుపక్కల బంధువులు కాదుకదా, ఎరిగివున్నవాళ్ళయినా ఎవ్వరూ లేరు.

'ఏమిటోయి పరమేశ్వరా, ఇలా వచ్చిందే నా సంగతి!' అని ఆలోచిస్తూ మరొక్క పదిగజాల దూరం వెళ్లేసరికి, ఒక రేగిచెట్టు, చెట్టునీడని చిన్న ఇల్లు కన పడినాయి. వీధిఅరుగుపయిన విస్తరాకులు కుట్టుకుంటున్న ఒక బ్రాహ్మడుకూడా కన పడ్డాడు. ఆయనను చూడగానే అప్పంభొట్లుకు ఒక ఆలోచన తట్టింది.

'ఇది బ్రాహ్మల ఇల్లు. సరిగా భోజనాల వేళకే అందుకున్నాను. పోతే ఇక భోజనం సంగతి చూసుకొందాము.' అని అనుకొని అప్పంభొట్లు రేగిచెట్టుకిందనే బండీ విప్పించివేశాడు. కాని, ముక్కూ మొగమూ ఎరగని కొత్తవారిని 'భోజనం పెడతారా?' అని ఎలా అడగటం? అది పెద్దమనిషి తరహాగా వుండదు.

ఆ మాటకొస్తే యింటివారికీ తనకూ ఏమి సంబంధ మున్నది? ఏదో ఒకటి కల్పించనయినా కల్పించాలి. లేకపోతే ఆకలి తీరే దారి లేదు. ఈ ఆలోచనతో

కొడుకుల నారాయణ - నర్సీపట్నం



అ రేగిచెట్టుకేసి చూడగా చూడగా, అప్పంభొట్లుకి ఒక చక్కటి ఉపాయం తట్టింది. 'నా బండి చక్రాలు లోగడ రేగికలపతోనే చేయించినట్టు బాగా జ్ఞాపకం. ఈ బ్రాహ్మల ఇంటి ముందు ఉన్నదీ రేగిచెట్టే. నిజానికి పూర్వజన్మ సంబంధం ఏదో ఉండబట్టే, ఇప్పుడు మా ఉభయులమధ్య ఈ బదరికా (రేగి) సంబంధం ఏర్పడింది. వారితో పరిచయం చేసుకోటానికి ఇంతకు మించిన చుట్టరికం ఏమి కావాలె?' అని అనుకొని సంతోషించాడు. ఒకవేళ ఇంటివారు 'మన బంధుత్వం ఏమిటండీ?' అని అడిగినప్పటికి తకిమని జవాబు చెప్పెయ్యవచ్చునని నిశ్చయించుకొన్నాడు. ఈ నిశ్చయంతో అప్పంభొట్లు చరచర నడవలోకి పోయి బట్టలు విడిచి పాగా కొయ్యకు తగిలించి, అంగాస్త్రంతో స్నానానికని నూతివద్దకు వెళ్లాడు. అంత చనవుగా ప్రవేశించిన అప్పంభొట్లును చూసి, వీధి అరుగుమీద విస్తరాకులు కుట్టుతూ కూర్చున్న ఇంటి యజమాని, బహుశా ఆయన తన భార్యవంక బంధువయి ఉంటాడని అనుకొని, తన పని తను చూచుకొంటున్నాడు.

స్నానం కాగానే, మడికట్టుకొని భోజనానికి తయారయిన అప్పంభొట్లుని చూసి, "ఓహో, ఈయన నా భర్తవంక బంధువు కాబోలు. వారే లోపలికి పంపించివుంటారు. తగువిధంగా మర్యాద చేయకపోతే బాగుండదు" అనుకొని, ఇంటావిడ ఏ లోపమూ రాకుండా భోజనం పెట్టింది.

భోజనమయిన తరవాత అప్పంభొట్లు, నడవలో ఖాళీమంచంపయిన పడుకొని, బడలిక తీర్చుకొన్నాడు. పొద్దు దిగి, కొంచెం చల్లబడగానే, బట్టలు వేసుకుని ఆయన మళ్లీ బండీ కట్టించాడు.

అంత అకస్మాత్తుగా ప్రయాణమై పోతున్న అప్పంభొట్లును ఇంటి యజమాని చూచి ఆశ్చర్యపడ్డాడు. వెంటనే భార్యను పిలిచి, "అయన నీకు ఏ వరసవాడు? వచ్చి రావటంలో అంత తొందరగా వెళ్ళి పోతున్నా డేమిటీ? ఈ రాత్రికి ఉండమన లేకపోయావా?" అని అన్నాడు.

"అయ్యో, బాగానే వుంది. ఆయన నాకు ఏవరసవారూ కారు. అసలింతకీ ఆయనెవరో నాకు తెలియనే తెలియదు. మీ తరపు బంధువేమో అని నేను పలకరించలేదు" అని ఆమె బదులుచెప్పింది.

"అయనెవరో నాకు అంతకంటే తెలియదు. మీఅమ్మగారికి సంబంధించిన దగ్గర బంధువులై వుంటారనుకొని నేను అసలు పలకరించలేదు. సరే మోసపోయాంలాగా వుంది" అని అయన అప్పంభొట్లువద్దకు వెళ్లి "అయ్యా క్షమించాలి. మనకూ మనకూ గల బంధుత్వం జ్ఞాపకం సరిగా రావటం లేదు. మరేమీ అనుకోకుండా సెలవిస్తారా?" అని నిష్కపటంగా అడిగాడు.

దానికి అప్పంభొట్లు చిరునవ్వు నవ్వుతూ "బంధుత్వం లేకేమండీ!



అస్మాకం బదరీ చక్రం,
ఉస్మాకం బదరీ తరుః
బాదరాయణ సంబంధం,
యూయం యూయం వ్యయం వ్యయః!

అంటే మీ ఇంటి ముందు బదరికా (రేగి) వృక్షం ఉన్నది. మా బండి చక్రాలు బదరికా మానుతో తయారైనవి. మనకూ మనకూగల బదరీ బాదరాయణసంబంధం ఇదేను." అని బదులు చెబుతూ, బండీ తోలించుకుపోయాడు.

ఈ వింత సంబంధం తెలియగానే దంపతులు తెల్లబోయారు.




అనగనగా ఒకరాజు. ఆ రాజుకి సంగీతమంటే చాల సరదా. తనకు సంగీతం నేర్పటానికని గొప్ప గొప్ప విద్వాంసుల్ని పెద్ద పెద్ద జీతాలమీద యేర్పాటు చేసుకున్నాడు. కాని రాజుకి వారివల్ల ఏమాత్రం సంగీతం అబ్బిందికాదు. ఒకవిద్వాంసుడు కాదని మరొకరు, అతనుకాదని మరొకరు, యిలా రాజు నెలనెలకీ సంగీత విద్వాంసుల్ని మార్చి చూస్తూనే వున్నాడు. కాని, పాపం ఒక్క ముక్కయినా సంగీతం పట్టుబడలేదు.

నోటితో పాడటం రాకపోతే పోయింది, కనీసం యే ఫిడేలో, వీణో వాయించటమన్నా వస్తుందేమోనని రాజు పేరుపడ్డ వాద్యసంగీత విద్వాంసుల్నికూడా ఏర్పాటు చేయించి చూచాడు. కాని, వారివల్లా ఏమీ కాకపోయేసరికి రాజుకి పెద్ద విచారం పట్టుకుంది. "ఇంతమంది వచ్చి ప్రయత్నించినా నాకు ఒక్క ముక్కయినా సంగీతం పట్టుపడకపోవటం ఎంత చిన్నతనం! ఈ సంగతి ప్రజలచెవిని బడిందంటే నేను చాల చులకనైపోతానే" అని. ఈ దిగులుతో రాజుకి సరిగా అన్నంకూడా సయించకుండ పోయింది. ఎప్పుడూ "నాకు సంగీతం ఎలావస్తుందా?" అని ఒకటే దిగులు.

ఇలా వుండగా ఒకరోజు రాత్రి రాజుకి కలలో ఒక దేవకన్య కనిపించి యిలా చెప్పింది: "రాజా! నీ మనస్సులో వున్న దిగులు ఏమిటో నాకు తెలుసు. నీ స్థితి చూస్తే నాకు చాల జాలివేసింది. నీకు సహాయం చేద్దామనే నేను వచ్చాను. ఇదిగో ఈ ఫిడేలు నీకు యిస్తున్నాను. దీన్ని చేతబట్టుకుని తీగెలమీద కమాను ఆడించితే చాలు. దీనినించి నీకు కమ్మటి సంగీతం వినిపిస్తుంది. నీవు ఎప్పుడు కోరితే అప్పుడు

డి. వి. నారాయణ రావు, కర్నూలు

నీ యిష్టం వచ్చినంత సేపు దీన్ని వాయించుకోవచ్చు. ఇందులో మరో విశేషంకూడా వుంది. దీన్ని నువ్వు ఎవరి యెదట వాయిస్తావో వాళ్లు పరవశమై నువ్వు కోరకుండానే నాట్యం చేస్తారు. నీవు ఫిడేలు వాయించటం ఆపితేగాని వాళ్లు ఆడటం మానలేరు. కనుక నీ యిష్టం వచ్చినప్పుడల్లా ఈ ఫిడేలు వాయించుకొంటూ హాయిగా వుండు."

ఇలా చెప్పి, ఆ దేవకన్య ఫిడేలుని రాజు పడుకున్న పక్కమీద పడేసి మాయమైంది. ఫిడేలుపడిన చప్పుడు విని రాజు త్రుళ్లిపడి లేచాడు. పక్కమీద ఫిడేలు వుంది. దాన్నితీసి చూసి "నిజంగా ఇది మోగుతుందా ?" అనుకుంటూ వాయించబోయాడు. కమాను తీగెలకు తగలగానే కమ్మటి సంగీతం వినవచ్చింది. రాజు తన చెవులను తానే నమ్మలేకపోయాడు.

అప్పటికి తను కలలో చూచింది నిజమేనని రాజు నిశ్చయించుకొన్నాడు. కలలో దేవకన్య చెప్పినవిషయాలన్నీ గుర్తుకు రాసాగినై. దేవకన్య చెప్పినట్లు ఫిడేలువాయించితే అది విన్నవాళ్లు నృత్యం చేసేమాట నిజమో కాదో పరీక్షచేసి చూడా






లనుకున్నాడు. వెంటనే నౌకరును కేక వేశాడు.

నౌకరువచ్చి నిలబడగానే, రాజు ఫిడేలు తీసి వాయించసాగాడు. వెంటనే నౌకరు నృత్యం చెయ్యసాగాడు. రాజుకి ఎంతో ఆనందం కలిగింది. ఇంకాత్వరగా, ఇంకా త్వరగా వాయించ సాగాడు. నౌకరు కూడా త్వరత్వరగా నృత్యం చేస్తూన్నాడు. చివరకు నౌకరుకు కాళ్ళు నొప్పి పుట్టినై. వాడు ఆడకుండా వుందామని ఎంత ప్రయత్నించినా తన వల్లకాక పోయేసరికి "ఇదేదో మాయగావుంది మహారాజా! నేను ఆడలేక పోతున్నాను. పోనీ, ఊరుకుందామంటే నావల్ల కాకుండా వుంది. ఎలాగైనా ఈ బాధ వదిలించండి. కాళ్లు లాక్కుపోతున్నై" అని గోలపెట్టాడు.

రాజు ఫిడేలు వాయించటం ఆపాడు. నౌకరు కూడా తక్కున ఆడటం మాని వేశాడు. ఇప్పుడు రాజుకి తనకు కలలో దేవకన్య కనిపించి చెప్పినదంతా నిజమని తేలిపోయింది. ఇక తననిచూసి ప్రజలు నవ్వుతారని తను భయపడవలసిన అవసరం లేదు.

తెల్లవారింది. మామూలు ప్రకారం రాజు దర్బారు జరుపుతూ, జరుపుతూ తన ఫిడేలుని వాయించసాగాడు. దర్బారులో వున్న మంత్రులు, సామంతులు, సేనానులు అంతా ఆడటం మొదలుపెట్టారు. తన ప్రజ్ఞఅంతా చూపాలని రాజు యింకా త్వరగా వాయించసాగాడు. వాళ్లు యింకా త్వరగా ఆడసాగారు.

"ఇక చాలించండి మహారాజా! మా కాళ్ళు పీక్కుపోతున్నై" అని అందరూ మొత్తుకునే వరకూ రాజు వాయించటం ఆపలేదు. చివరకు ఎలాగైతేనేం రాజు ఫిడేలుఆపాడు, మంత్రులూవాళ్ళు ఆడటం

మానేశారు. అంతటితో ఆ రోజు దర్బారు ముగిసింది.

రాజు ఫిడేలుని ఎప్పుడూ తన దగ్గిరే జాగ్రత్తగా వుంచుకునేవాడు. నిద్రపోయే టప్పుడు కూడా పక్కలో పెట్టుకు పడుకునే వాడు. కనపడ్డవాళ్లందరి యెదటా ఫిడేలు వాయించటం, వాళ్ళు ఆడటం, వాళ్లకు కాళ్లు నొప్పులు పుట్టేవరకూ వాయించి, వాళ్లు గోల పెడుతుంటే తనునవ్వటం రాజుకు ఒకఆట అయిపోయింది.

ఒకరోజున రాజు దర్బారులో వున్నాడు. ఫిడేలుపక్కనే వుంది. దర్బారు ముగిసిన తర్వాత మామూలు ప్రకారం రాజు ఫిడేలు వాయించటానికి ఫిడేలుకోసం ప్రక్కన చూశాడు. అది అక్కడ లేదు. రాజు ఆశ్చర్యపోయాడు. "ఏ దుర్మార్గుడు ఈ దొంగతనం చేసింది!" అంటూ కళ్లెర్ర జేశాడు.

అప్పుడు దర్బారుమధ్య ఒక స్తంభం మీద ఒక కోతి ఫిడేలుపుచ్చుకు వాయిస్తూ కనిపించింది. కోతి వాయించ సాగేసరికి రాజు ఆడసాగాడు. కాని దర్బారులో వున్న మిగతవాళ్లు మాత్రం ఆడటం లేదు.



కోతి ఫిడేలు చాల త్వరత్వరగా వాయించ సాగింది. రాజు గోలపెడుతూ చిందులు త్రొక్కసాగాడు. ఆ విధంగా ఆడి, ఆడి రాజు చివరకు అలిసి మూర్ఛపోయాడు. మంత్రులూ వాళ్లు రాజుచుట్టూ గుమికూడి శైత్యోపచారాలు చేశారు. కొంతసేపటికి రాజుకు తెలివి వచ్చింది. కోతికోసం చూచాడు. కాని యిప్పుడు అక్కడ కోతికి బదులు ఒక దేవకన్య నిలిచి వుంది. ఆమె చేతిలో ఫిడేలు వుంది. రాజు తెల్ల బోతూ ఆమెవంక చూడసాగాడు.

"అలా చూస్తావేం రాజా! నీవేమీ కల గనటం లేదు. నీ దుర్బుద్ధికి తగిన ఫలం పొందావు. అంతే" అన్నది దేవకన్య.

"నేనేం తప్పుచేశాను" అన్నాడు రాజు భయపడుతూ.

"ఇంకా ఏంచెయ్యాలి? పాపం, నవ్వుల పాలై పోతావుగదా అని నీకు నేను ఫిడేలు యిస్తే, అమాయకుల నందర్నీ ఏడిపిస్తావా? వాళ్ళు ఎంతకష్టపడ్డారో నీకు ఇప్పటికైనా తెలిసిందా?" అంది దేవకన్య.

"తప్పుచేశాను. క్షమించు తల్లీ. ఇక ముందు అలా చెయ్యను. ఫిడేలుని తిరిగి దయచెయ్యి" అని యెంతో దీనంగా అడి గాడు రాజు.

దేవకన్యకి జాలి కలిగింది. ఫిడేలుని రాజుకు అందిచ్చి ఆమె మాయమైంది.

రాజు చాల సంతోషించాడు. ఆ నాటికిక దర్బారు చాలించాడు. ఎవరిళ్ళకు వాళ్లు వెళ్లిపోయిన తర్వాత, రాజు ఒంటరిగా కూర్చుని కొంచెంసేపు ఫిడేలు వాయించు తున్నాడు.

ఆ రోజు మొదలు రాజు ఎవరినీ ఏడి పించకుండా తనకు కావలసినప్పుడు మాత్రమే ఫిడేలు వాయించుకుంటూ హాయిగా రాజ్యం చేస్తున్నాడు.






అనగనగా ఒక ముసలివానికి దైనా అనే ఒక కూతురు. అతనికి భార్య లేకపోవటం చేత కూతురే ఇల్లు చక్క పెట్టుతూ వుండేది.

కొంతకాలానికి, ముసలివానికి బుద్ధి పుట్టి మళ్లీ పెళ్లి చేసుకొన్నాడు. సవతితల్లి రాగానే ఇల్లంతా తారుమారయి, దైనాకు స్వేచ్ఛ తగ్గిపోయింది. ముసలివానికి ఇప్పుడు పెళ్లాం ఎంతచెబితే అంత. అందుచేత పిల్లమీద మగనితో నేరాలు చెప్పేది. తిండివేళకు, మిగిలిపోయిన ఎంగిలి రొట్టె ముక్కలు రాల్చి, 'ఎక్కడి కయినా పోయి మింగు' మని కసిరేది.

దైనా ఏమి చేయగలదు? పెరట్లో మూలని వుండే చిన్ని పాకలోకి పోయి, కంటికి కడివెడు నీళ్లుగా ఏడిచేది. ఇలా వుండగా ఒకనాడు పాకలో కన్నంలోనించి కిచకిచలాడుతూ ఒక చుంచునేస్తం వచ్చి కనపడింది. అది వెనుక కాళ్లపైన ఎదురుగా కూర్చునేసరికి, జాలిగుండె గల దైనా, తన రొట్టె చిదిపి ఒక ముక్క దానికి పడవేసింది. చుంచు అది తినేసి మళ్లీ మళ్లీ ఆమెవేపు చూడటం మొదలుపెట్టింది. అది చూచినప్పుడెల్లా ముక్కలు పడవేస్తూ ఉండేసరికి దైనాకు రొట్టె మిగలకుండా పోయింది.

అప్పుడు చుంచు, "దైనా! కొంచెమైనా రొట్టె నీకు అట్టేపెట్టకుండా పాపం, నేను తినివేశాను. అయితే ఏమిలే. నీకు పనికి వచ్చే మాట ఒకటి చెబుతా, విను! కొత్తగా వచ్చిన నీ మారుతల్లి ఎవరను కొన్నావో! మనిషిరూపంతో కనపడే రాకసి. ఆమె బాబాయాగా అనే బ్రహ్మరాకసికి చెల్లెలు. పని పెట్టుకుని నీ మారుతల్లి తన అక్కవద్దకు నిన్ను పంపుతుంది. అప్పుడు వచ్చి నన్ను పిలిస్తే, నీకు గండం దాటే ఉపాయం చెబుతా" అని సలహా ఇచ్చింది.

కె. నారాయణ రెడ్డి, సికింద్రాబాదు




లాడుతూ చుంచునేస్తం ఎదురువచ్చి "డైనా, నీకు వచ్చిన భయం లేదు. దారిలో దొరికిన వస్తువు ఏదయినా సరే, మంచిదని తోస్తే, తీసి జాగర్త పెట్టు, నీకు మేలు కలుగుతుంది" అని చెప్పి మాయమైంది.

ముందుగా డైనాకు ఒక కొత్త జేబు రుమాలు దొరికింది. దానిని అమె చేత పుచ్చుకొన్నది. తరువాత ఒక సీసాతో చమురు, కొన్ని మాంసపు ముక్కలు, ఒక నీలిరంగు రిబ్బను, మంచి రొట్టెముక్క ఇవన్నీ వరుసగా కనపడినాయి. వీటన్నింటిని జాగర్తగా తీసి, అమె దగ్గిర పెట్టుకుంది.

చివరకు డైనా, అడివిలో పెద్దమ్మ ఉండే కోట చేరుకుంది. ఆ అందలానికి ఎత్తయిన కంచె, కంచెకు పెద్ద ద్వారాలు ఉన్నాయి. డైనా తలుపులు తోసేసరికి అవి "కుయ్యో, మొర్రో" మని చప్పుడు చేశాయి. వెంటనే డైనా తనవద్ద ఉన్న సీసాతీసి, అందులో చమురు బందులలోకి వొంచింది.

ఇంకా కొంచెం లోపలకు వెళ్లేసరికి, ఏడుస్తూవున్న దాసీది కనపడింది. డైనా అమెనుఓదార్చి, కన్నీళ్లు తుడుచుకోటానికి తనవద్ద ఉన్న జేబురుమాలు ఇచ్చింది.

ఇలా ఉండగా ఒకనాడు, ముసలివాడు ఊరికి వెళ్లడం చూసి, అతనిభార్య డైనాను పిలిచింది. 'అడివిలో పెద్ద కోటలో మీ పెద్దమ్మ ఉన్నది, అమెను అడిగి సూదీ దారం ఇమ్మన్నానని తీసుకురా' అని అంటూ, పోయి రావటానికి అనవాళ్లు చెప్పింది.

డైనా వెళ్లేవరకూ అమె గుమ్మంలోనే నిలబడి వుండటంచేత, చుంచు నేస్తాన్ని కలుసుకుని ఈసంగతి చెప్పటానికి డైనాకు సావకాశం లేకపోయింది.

చాలాదూరం నడిచి, డైనా ఒక పడి పోయిన చెట్టు చేరుకొనేసరికి, కిచకిచ

పనిమనిషికి దగ్గరలోనే బక్కచిక్కిన ఒక పెద్దకుక్క ఉన్నది. అది తిండిలేక ఉసూరుమని ఉండటంకనిపెట్టి, డైనా రొట్టెముక్క దానికివిసరగా, అది గబుక్కున అందుకుని తినేసి, సంతోషంతో తోక ఆడించింది.

డైనా వచ్చిన సంగతి తెలుసుకుని, గదిలో మగ్గం నేస్తూవున్న బాబాయాగా నవ్వుతూ డైనాను పిలిచింది. ఆమె తను వచ్చిన పని చెప్పగా "ఇదుగో ఈ మగ్గం నేస్తూవుండు. నేను వెళ్లి నీకు సూదీ దారం తెచ్చిపెడతాను" అన్నది. పనిమనిషిని పిలిచి యాగా, "ఇవాళ మా అమ్మాయి వచ్చింది. చప్పున నీళ్లు కాచి ఆమెకు తలంటి పోసెయ్యి" అని తొందరపెట్టింది.

యాగా చెప్పినప్రకారం డైనా మగ్గం నేస్తూనేవుంది. ఆమెకు గదిలో ఒక పొంచివున్న నల్లపిల్లి కనిపించి "నాకు మూడు రోజులనుంచి తిండి లేదు. కడుపు మాడిపోతున్నది," అనగానే దయగల డైనా తనదగ్గర ఉన్న మాంసపుముక్కలు తక్షణమే దానికి పడవేసింది.

నల్లపిల్లి సంతోషించి "అమ్మాయీ! నువ్విక్కడ అట్టేసేపు ఉన్నావంటే ప్రాణానికి మోసం వస్తుంది. తప్పించుకు



పోయే ఉపాయం చెబుతా, విను: మీ పెద్దమ్మ ఇప్పుడు నీళ్లగదిలో ఉన్నది. నీకు బదులు నేను మగ్గం నేస్తూవుంటాను. నువు పారిపో. ఆమె నిన్ను వెంట తరుముకొస్తే ఈ చేతిరుమాలు తీసి విసురు. ఆ తరువాతకూడా ఇంకా తరుముకువస్తే ఈ పువ్వు తీసి విసురు. నీకు మేలు కలుగుతుంది," అని చెప్పి ఒక జేబు రుమాల, పువ్వు యిచ్చిపంపింది.

ఆప్రకారమే డైనా వచ్చిన దోవనే మళ్లీ పారిపోవటం మొదలుపెట్టింది. కాపలి కాస్తున్నకుక్క యిది కనిపెట్టి ఆమెమీదికి



ఊరికింది గాని తీరా మనిషిని చూచాక, 'ఓహో ఈమె నాకు రొట్టెముక్క ఇచ్చిన పిల్లలాగుంది. చాలా దయగలది' అని అనుకొని, ఏమీ అనకుండా ముడుచుకు పడుకుంది.

ఆమె గుమ్మంవద్దకు వచ్చేసరికి, తమకు చమురుపోసిన డైనాను గుర్తించి, తలుపులు చప్పుడుచేయక దారిచ్చాయి.

గుమ్మం దాటగానే కళ్లుపొడిచే ముళ్ళ చెట్టున్నది. డైనా తనదగ్గర ఉన్న నీలి రిబ్బను తీసి దానికి కట్టింది. ఆ రక్కసి చెట్టుకి ఎంతో అందం వచ్చేసరికి, అది పొంగిపోయి డైనాను కళ్లుపొడవకుండా వదిలేసింది. ఇక ఏమీ ఆటంకం లేకపోగా డైనా లేడిపిల్లలాగ పరుగుచ్చుకొన్నది.

ఇంతలో యాగా గదిలోకి వచ్చి చూచింది, డైనా కనపడలేదు. మగ్గం దగ్గిర కూచున్న నల్లపిల్లిపైన మండిపడి "భడవా! పిల్లకు గుడ్లు పెరికివేయకుండా ఎందుకు ఊరుకొన్నావు?" అని అడిగింది.

"ఇన్నేళ్లనించీ పనిచేస్తున్నా ఎండి పోయిన ఎముకముక్కలు తప్ప మరే మన్నా పడవేసిన పాపాన పోయావా? ఆ అమ్మాయి చూడు, ఎంత మంచిదో. అడగకుండానే మంచి మాంసంముక్కలు పెట్టింది" అంటూ నల్లపిల్లి చెప్పింది.

ఈమాట వినగానే బాబాయాగా నల్ల పిల్లిని నాలుగుకాళ్లూ పట్టుకొని విసిరి పార వేసి గుమ్మం దగ్గరకు వెళ్లింది. 'గుమ్మమా గుమ్మమా, ఆ పిల్ల పారిపోతూవుంటే ఎందుకు చప్పుడు చేశావు కావు?' అని అడిగింది.

ఆమె అడిగిందానికి గుమ్మం అన్నది కదా: 'ఇన్నాళ్ళనించీ నీ చాకిరీ చేస్తూ వుంటే, ఒక్క నీటిబొట్టు అయినా వేసి గొంతు తడిపావా? ఆ అమ్మాయి చూడు,

ఎంత దయకలదో. అడగకుండానే మాకు చక్కని నూనె పోసింది....' అని.

తరవాత 'పెద్దకుక్కా పెద్దకుక్కా! ఆ పిల్లపైన ఉరికి ముక్కలు చేయకుండా ఎందుకు ఊరుకొన్నావు?' అని యాగా కుక్కను అడిగింది.

"ఎంతకాలం నీ కొలువు చేసినా, చాలీ చాలని మాడురొట్టె ముక్కలేకదా పడ వేయటం. ఆ పిల్ల చూడు. అడక్కుండానే పాపం, ఎంత మంచి రొట్టె ఇచ్చిందో!" అని పెద్దకుక్క అన్నది.

'రక్కసి చెట్టా రక్కసి చెట్టా! అపిల్ల కళ్లు పొడవకుండా ఎందుకు వదిలేశావు?' అని చెట్టును అడిగింది.

'ఇన్నిఏళ్లుగా నీకు సేవచేస్తున్నప్పటికీ ఒక్క నూలుపోగయినా కట్టిన పాపాన పోయావా? అపిల్ల ఎంత మంచిదో చూడు, అడక్కుండానే నాకు చక్కటి రిబ్బను కట్టింది' అని రక్కసిచెట్టు జవాబుచెప్పింది.

చివరకు దాసీదానివద్దకు వచ్చి 'ఓసీ పాపిష్టీ! నువు చప్పున నీళ్ళు కాచకపోవ టానికి కారణమేమిటి? నీ ఆలస్యంవల్ల కదా ఆ పిల్ల పారిపోయింది?' అని గర్జించి గోలచేసింది.



'నీకు ఎంతకాలం నవుకరీ చేస్తే యేం లాభం! ఎప్పుడూ చివాట్లు వేయటమే తప్ప జానెడు గుడ్డముక్క పడవేసి ఎరుగు దువా? జాలిగుండె గల ఆ అమ్మాయి చూడు, అడక్కుండానే ఎంత అంద మయిన రుమాలు బహుమతి యిచ్చిందో!' అని పనిమనిషి అన్నది.

ఈ అదును చూసుకొని దైనా గబగబా పరుగెత్తిపోతూనేవుంది. నల్లపిల్లి చెప్పి నట్టుగా ఆమె ఒక్కసారి నేలకు చెవి ఆనించి వినేసరికి, బాబాయాగా పరిగెత్తి వస్తున్న చప్పుడు వినపడింది. ధ్వనివెంబడే

యాగా ఎగేసుకునివచ్చింది. అప్పుడు డైనా జేబురుమాలు తీసి నేలమీద విసరగా, అది ఒక పెద్ద ఏరుగామారి, డైనాకూ యాగాకూ మధ్యని అడ్డుగా ప్రవహించింది.

ఆ పెద్ద ఏరు దాటలేక, యాగా దేముడా అంటూ ఇంటికి పోయి, తన పశువులమందను తోలుకువచ్చి, ఒక్క చుక్కయినా మిగలకుండా ఏటిలో నీళ్లు పశువులను తాగివేయమన్నది.

బాబా చెప్పినప్రకారం పశువులు ఏటిలో నీళ్ళన్నీ తాగివేశాయి. ఏరు ఎండిపోగానే, యాగా మళ్లీ డైనాను వెంబడించింది.

డైనా తనతలలో పువ్వుతీసి కిందికి విసిరేసరికి, అక్కడ ఒక పెద్ద అరణ్యం తయారయింది. ఆ అరణ్యంలో ప్రవేశించటానికి బాబాయాగా వంటి బ్రహ్మరాక్షసికే శక్యంకాలేదు. అందుచేత కాళ్లు ఈడ్చుకొంటూ యాగా కొంప చేరుకుంది.

ఇదే సందు చూచుకొని, డైనా అడవులు దాటి ఇంటికి మళ్లింది. కాని ఇంటిలోపలికి వెళ్లాలంటే ఆమెకు జంకు కలిగింది.

అప్పుడు ఆమె తనకు అలవాటయిన పాకలోకి పోయేసరికి చుంచు నేస్తం నవ్వుతూ వచ్చి "డైనా! నేను చెప్పినట్టుగా నువు అన్నీ బాగానే చేసుకువచ్చావు. మీ నాయన ఇప్పు డింట్లోనే వున్నాడు. ఇప్పటి వరకూ జరిగిన సంగతులన్నీ భయపడక ఆయనతో చెప్పు" అని సలహా ఇచ్చింది.

జరిగిన కథ అంతా డైనా తన తండ్రితో పూసగుచ్చినట్టు చెప్పేసరికి, ఆయన రెండో భార్యను మెత్తగా తన్ని తరిమివేశాడు. చేసేది లేక ఆమె తన అసలు రాక్షసి రూపంతో అడవులుపట్టి పోయింది.

ఇక యిప్పుడు పూర్వంలాగా ఆ యింట్లో డైనాయే పెత్తనం చేస్తూ, తండ్రీ కూతురూ కులాసాగా కాలక్షేపం చేస్తూవున్నారు.






ఒక వూరిలో ఒక బీద బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన గొప్ప పండితుడు. ఐతే, ఆ బ్రాహ్మణుడి పాండిత్యాన్నీ విద్యనూ చూచినవాళ్లెవరూ లేకపోయారు. ఆదరణ లేకపోవడంచేత అయన గర్భ దరిద్రంలో మగ్గిపోతూవున్నాడు. పేదరికానికి తోడు, కుచేలుడి మోస్తరుగా, మన బ్రాహ్మణుడికి గంపెడుమంది పిల్లలు కూడాను.

ఆ పెద్ద కుటుంబాన్ని పోషించే దారి కనపడక, అయనకు సంసారమంటే విరక్తి పుట్టేసింది. అందుకని, ఒకరోజున ఎవ్వరికీ చెప్పకుండా కాశీ పోదామని బయలుదేరాడు.

పోయి పోయి, బ్రాహ్మణుడు కొన్నాళ్లకు ప్రయాగ చేరుకొన్నాడు. ప్రయాగ పేరు పొందిన పుణ్యక్షేత్రం. అందులోనూ ఇక్కడ గంగా, యమునా, సరస్వతీ అనే మూడు నదులు కలుస్తున్నాయి. ఈమూడు నదులూ కలిసే ప్రదేశాన్నే 'త్రివేణీ సంగమం' అని అంటారు.

అసలు ఈ మూడు నదులూ, దేనికదే చాలా మహిమ కలది. అటువంటప్పుడు మూడూ ఒకే చోట కలుస్తున్నవంటే ఆ మహిమ ఎంతటిదో ఎవరు చెప్పగలరు? ఎవరైనా మనస్సులో ఒక కోరిక కోరుకొని, ఈ సంగమంలో పడి చచ్చిపోయినట్టయితే, మళ్లీ జన్మలో ఆ కోరిక తప్పక నెరవేరుతుందని ఒక వాడుకకూడా ఉన్నది.

ఈ నమ్మిక అలావుంచి పుణ్యం ఆర్జించాలనే వుద్దేశంతో దేశ దేశాలనించి వేనవేలు జనం వచ్చి, ప్రతిరోజూనా త్రివేణిలో స్నానం చేస్తూవుంటారు. ఈ జనాన్ని చూసేసరికి, మన పేద బ్రాహ్మణుడికికూడా ఇక్కడ స్నానంచేసి పుణ్యం ఆర్జించాలని బుద్ధి పుట్టింది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



ఈజన్మానికి ధనం ఎలానూ లేదు, పుణ్యమన్నా ఆర్జిద్దామని అతని ఆశ.

ఒకనాడు ఇలానే ఆయన స్నానంచేయటానికి వచ్చేసరికి, నది ఒడ్డున నలుగురు అమ్మాయిలు అగపడ్డారు. వాళ్లు కేవలమూ దేవలోకంనించి దిగివచ్చిన గంధర్వ కన్యలా అన్నంత అపరూపమయిన అందముతో వెలిగిపోతున్నారు!

వాళ్ళ అందము, ఉత్సాహము, ఏదో ఒక గొప్ప పని చేయబోతున్నట్టు కనపడే వాళ్ళ ప్రయత్నమూ బ్రాహ్మణుడిని ఆకర్షించాయి. వాళ్ళు మెల్లిగా నదిలోకి దిగి, అలా నీటిలోపలికి పోతూనే వున్నారు. కొత్తవాళ్లు కావడంచేత నీటిలోతు తెలియదేమోనని అనుకొని, బ్రాహ్మణుడు వాళ్ళతో "ఇక లోతుకి పోబోకండి, మునిగిపోతారు" అని హెచ్చరించాడు. 'ఎంత లోతుంటే మాత్రం మాకేం భయం? మళ్లీ జన్మలో నెరవేరటానికిగాను, కోరికలు కోరుకుని మునిగిపోవటానికే వచ్చాం' అని ఆ అమ్మాయిలు నవ్వుతూ, త్రివేణీ మహిమను చెప్పారు. పేద బ్రాహ్మణుడు ఆశ్చర్యంతో వాళ్ళవేపు చూస్తూ నిలబడిపోయాడు.

ఆ అమ్మాయిలలో మొదటి ఆమె, "పరమేశ్వరా! ధనమేకదా జగత్తంతకూ మూలము? మళ్లీ జన్మలో నాకు డబ్బున్న మగడు కావాలి. డబ్బున్నందుకు, తనింత తిని, ఒకళ్ల కింతపెట్టి, దాన ధర్మాలకోసం, మంచి పనులకోసం దానిని వినియోగించే ధర్మగుణంకూడా నాభర్తకు ఉండాలి." అని కోరుకొని, బుడుంగున మునిగిపోయింది.

రెండో పిల్ల—"స్వామీ! ధనం శాశ్వతమయింది కాదు. విద్య ఉన్నట్టయితే ధనమూ, కీర్తీ దానివెంబడే వస్తాయని పెద్ద లంటారు. కనుక నాకు మళ్లీ జన్మలో విద్వాంసుడు, పండితుడు, కవి అయినటు

వంటి మహానుభావుడు భర్త అయేటట్టు వరం అనుగ్రహించు" అని కోరుకొని, ఆమె బుడుంగున మునిగిపోయింది.

మూడవ ఆమె, "ఎప్పుడైనా ధనమూ, విద్య కలిసి ఉన్నప్పుడే మానవుడి జీవితం రాణిస్తుంది. వీటికితోడు అధికారం కూడా ఉన్నట్టయితే ఇక కోరవలసింది మరేమీ ఉండదు. అందుచేత ధనవంతుడూ విద్యావంతుడూ అయిన ఒక రాజును నాకు వచ్చే జన్మలో పతిగా చేయవలసింది దేవా!" అని కోరుకుని, బుడుంగున మునిగిపోయింది.

ఇక, నాలుగో అమ్మాయి—"భగవాన్! కంటికి ఇంపయిన చక్కటి రూపం లేకపోతే, ఈ లోకంలో మరి ఏముంటేమాత్రం సార్థకమున్నది? అన్నీ అందానికి తరవాతివేను. కనుక, దబ్బపండువంటి పచ్చటి శరీర చ్ఛాయతో, పున్నమచంద్రునివలె కలకలలాడే ముఖంతో, మన్మథునివంటి సౌందర్యంకల భర్తను నాకు మళ్లీ జన్మలో ప్రసాదించు ప్రభూ!—" అని అంటూ, బుడుంగున మునిగిపోయింది.

ఇలా చిత్రంగా, మనోవాంఛలు నెరవేర్చుకోటానికని ఆ నలుగురు అమ్మాయిలు



నవ్వుతూ గంగమ్మ తల్లికి ప్రాణాలు అర్పించడం చూచి బ్రాహ్మణుడి మనస్సులో అనేకభావాలు పరుగులెత్తినాయి.

వాళ్ళ సాహసానికి అతను ఆశ్చర్య పోయాడు. అతనికికూడా ఏదో ఒక కోరిక కోరుకుని చచ్చిపోదామని ఆలోచన కలిగింది. అయితే ఏ కోరిక కోరుకోవాలి? 'ఈ జన్మంతా తను దరిద్రంతోనే బాధ పడవలసి వచ్చింది. కనుక మళ్ళీ జన్మలో ధనవంతుణ్ణి కావాలని కోరుకోవాలా? లేదా, ఇప్పటిమోస్తరు గయ్యాళి పెళ్లాం గాకుండా అనుకూలవతి కావాలని కోరుకోవాలా?' బ్రాహ్మణుడికి చాలాసేపు ఏదీ తెగలేదు. ఇంతలో అతనికి ఆ అమ్మాయీల కోరికలు జ్ఞాపకం వచ్చినవి.

అయినా ఇంత ఆలోచన ఎందుకు? జీవితంలో మానవులు కోరవలసిన వన్నీ, ఆ నలుగు రమ్మాయిలూ కోరనేకోరారు. కనుక, తనకు శ్రమే తప్పింది అని అనుకుని, ఆ పేదబ్రాహ్మణుడు అంగాస్త్రం నడుముకి బిగించి, నదిలోకి దిగాడు.

"దేవా! నాది వక్కటే చిన్న కోరిక వున్నది. ఇప్పుడు కోరికలతో మునిగిపోయిన ఆ నలుగురు కన్యలకూ నేను వచ్చేజన్మలో భర్తనయేటట్టు అనుగ్రహించు!!" అని అతను ఆ గుండంలో మునిగిపోయాడు!!!

వాళ్ళవాళ్ళ కోరికలప్రకారం మళ్ళీ జన్మలో ఆ అమ్మాయిలు నలుగురూ నాలుగు రాజకుటుంబాలలో జన్మించారు. బ్రాహ్మణుడు ధారానగరంలో సింధుల మహారాజు కుమారునిగా పుట్టాడు.

ఆయనే మన దేశంలో కీర్తిగడించిన భోజమహారాజు. ఆ నలుగురు అమ్మాయిలూ సుగంధి, పద్మగంధి, కనకవతి, చంద్రప్రభ అనే పేరులతో భోజమహారాజుకు రాణీ లయినారు.






ఇప్పుడు వృద్ధుడూ, అతని ప్రక్కనే ధీరవర్ముడి కిరీటం గాలిలో తేలుతూ పోతూ వున్నారు. వీళ్ళ యిద్దరికి పైన యింకో గజం ఎత్తులో మరో కిరీటంకూడా గాలిలో తేలిపోతూవుంది. అది వృద్ధుడి మేనకోడలిదే. వృద్ధుడు బయలుదేరి, ఎక్కడికి వెళ్లినా ఆమెకూడా అదృశ్యంగా వస్తూనేవుంటుంది. ఈ సారి వృద్ధుడు ధీరవర్ముడిని కలుసుకున్నప్పటినించికూడా ఆమె ఆకాశంలో తేలుతూ వస్తూనేవుంది. ఈ సంగతి ధీరవర్ముడికి తెలియదు.

మధ్య దారిలో కిరీటంగా మాత్రమే కనిపిస్తున్న వృద్ధుడి మేనకోడలు వాళ్లతలల పైకి చాల దగ్గిరికి వచ్చింది. ఆ కిరీటానికి రెక్కలుకూడా వుండటంవల్ల ఆ రెక్కల చప్పుడు ధీరవర్ముడి చెవిన పడింది. "ఏమిటి, తాతా ఏదో రెక్కల చప్పుడవుతోంది?" అని అడిగాడు.

"అది ఉత్త చప్పుడు కాదు. నా మేనకోడలు ఒకామె వుంది. ఆమెకూడా నీలాగే ఒక మాయకిరీటం ధరించి మొదటినించీ మనతోపాటు వస్తోంది. ఆమె కిరీటానికి రెక్కలుకూడా వున్నై. నువ్వు విన్నది ఆ రెక్కల చప్పుడే. ఆమె మనిద్దరికీ పైగా వున్నది చూడు" అని చెప్పాడు వృద్ధుడు.

ధీరవర్ముడు తల పైకెత్తి చూశాడు. వృద్ధుడు చెప్పినట్లుగానే యింకో కిరీటం, రెక్కలు రెపరెప కొట్టుకుంటూ వస్తూవుంది.

అలా వాళ్ళు వస్తూ వుండగా, ఒకచోట వృద్ధుడు "మనమడా, ఇక జాగ్రత్త. ఆ రాక్షసుడుండే చోటికి చాల దగ్గిరగా వచ్చాము. పొరపాటున నీవు వాడివంక చూశావంటే వెంటనే రాయిగా మారిపోతావు. ఇంతవరకూ మనం పడ్డ కష్టమంతా వృధా అవుతుంది. అందువల్ల చాల జాగ్రత్తగా వుండు" అని హెచ్చరించాడు

ఒక గ్రీకు కథకు అనుకరణ



"అలాగే తాతా, మరి మీరు మాత్రం కళ్లు మూసుకుని వుండవద్దా?" అని అడిగాడు ధీరవర్ముడు.

"మేము వాడిదగ్గిరికి రాము. అందువల్ల మేము కళ్లు మూసుకోవలసిన అవసరం లేదు. నీవు మాత్రం చాల జాగ్రత్తగా వుండాలి. వాడు ఏమిచేస్తున్నాడో వాడివంక చూడకుండా నువ్వు చూడగలగటానికే నీ డాలును అద్దంలా తోమమన్నాను. డాలుని అందుకు ఉపయోగించుకో" అని చెప్పాడు వృద్ధుడు. సరే నన్నాడు ధీరవర్ముడు.

ఇప్పుడు వాళ్లు ఒక సముద్రంపైన ఎగురుతున్నారు. క్రింద సముద్రపు ఒడ్డుకు కొంత దూరంలో ఆ రాక్షసుడు గుర్రుపెట్టి నిద్రపోతుండటం వృద్ధుడికి కనిపించింది. వాడి తలల మీదవున్న పాములు బుసలు గొడుతున్న శబ్దంకూడా వినిపిస్తోంది.

"అదుగో అక్కడ సముద్రపు ఒడ్డున చూడు. నీవు చంపవలసినది వాడినే. కిరీటం క్రింద మాయమై వున్నావు కనుక నువ్వు ఎక్కడ వున్నదీ వాడు తెలుసుకోలేడు కాని వాడిని నువ్వు చూడగలవు. చూడగలను కదా అని వాడి వంక మామూలుగా చూసేవు జాగ్రత్త. నీ డాలులోకి వాడి ప్రతిబింబం కనిస్తుంది కనుక డాలులో చూస్తూవుండు. నేను నీకు యిదివరకు యిచ్చిన కత్తి వాడిని నరకటానికి పనికివస్తుంది. ఒక్క వేటున వాడి తలలని నరికి, వాటిని ఈ సంచీలో పెట్టి బిగించి తీసుకురా" అని చెప్పి యక్షిణి యిచ్చిన మాయ సంచీ యిచ్చాడు వృద్ధుడు.

"ఇదేమిటి? ఈ సంచిని ఆకలి తీర్చుకునేందుకేకదా వాళ్లు మనకు యిచ్చింది. దీంట్లో ఆ పాపిష్ఠి తలలని పెట్టటమేమిటి? ఐనా అంత పెద్దతలలు ఈ చిన్నసంచీలో

ఎలా పట్టుతై?" అని అడిగారు ధీరవర్ముడు.

"అదంతా అనవసరం. నేను చెప్పినట్లు చెయ్యి. ఇక ఆలస్యంచేస్తే లాభంలేదు. వాడు నిద్రలేచాడంటే మళ్లీ ఏడాదివరకూ నిద్రపోడు. వెంటనే పో" అని తొందరచేసి ధీరవర్మణ్ణి తరిమాడు వృద్ధుడు.

ధీరవర్ముడు ఎకాయెకిని సముద్రపు ఒడ్డుకు వచ్చి, ఆ రాక్షసుడిపైకి కొద్ది దూరంలో గాలిలో తేలుతూ సమయం కోసం చూస్తున్నాడు. రాక్షసుడు దిట్టంగా నిద్రపోతున్నాడు. కాని వాడి తలలమీద వున్న పాములు బ్రహ్మాండంగా బుసలు కొడుతున్నై. ఇదంతా ధీరవర్ముడు తన డాలులో చూసి కనిపెడుతూ న్నాడు.

దూరాన్నించి ఆకాశంలో వృద్ధుడూ అతని మేనకోడలు కూడా యిది చూస్తూనే వున్నారు. ధీరవర్ముడు ఆలస్యం చెయ్యటం చూచి వృద్ధుడు "ఇంకా చూస్తావేం, నరుకు" అని పెద్దగా కేకవేశాడు.

ఈ కేక ధీరవర్ముడి చెవిన పడట మేమిటి, ధీరవర్ముడి చేతిలోవున్న కత్తి రాక్షసుడి మెడమీద పడి సర్రున మూడు తలలు మొండెంనించివేరుకావట మేమిటి





అందుచేత సంచీమూతిని ఏలాటి పరిస్థితుల్లో విప్పనే కూడదు." అన్నాడు వృద్ధుడు.

అలాగే వృద్ధుడు మామూలు రూపంతో, ధీరవర్మడు కిరీటం రూపంతో వృద్ధుడి మేనకోడలు రెక్కల కిరీటంరూపంతోనూ గాలిలో తేలిపోతూ మరో మూడు రోజుల కల్లా దుష్టపాలుడి రాజ్యం చేరుకున్నారు.

మేనల్లుడు తిరిగి ప్రాణంతో తన ఎదటికి వస్తున్నాడని తెలిసేసరికి దుష్టపాలుడు తన చెవులను తానే నమ్మలేకపోయాడు. అయినా, ఎంతోమెచ్చుకున్నవాడిలా వాళ్లకి ఎదురు వచ్చి, వృద్ధుడు వాళ్లవంక చూపుతూ, "వీళ్ళెవరు" అని అడిగాడు.

"నీవు నాకు ఒప్పజెప్పిన పనిని జయప్రదంగా నెరవేర్చి తిరిగి నేను బ్రతికి నీ ఎదటికి రాగలిగింది వీళ్ళ సహాయంవల్లనే. వీళ్ళు లేకపోతే నేను ఒక రాయిగా మారిపోయి వుండేవాడిని. నేను చంపిన రాకసుడితలలు ఇదుగో ఈసంచిలో వున్నై. కాని వాటివంక చూడటానికి వీలులేదు" అని చెప్పాడు ధీరవర్మడు.

"చంపానన్నావుకదా. ఇక ఆ తలల్ని చూపరాదా, అంత ప్రమాదంఏముంది?" అన్నాడు దుష్టపాలుడు.

ఒక్కసారిగా జరిగినై. ఇక ధీరవర్మడు ఆ తలల్ని సంచీలో పెట్టటానికి మూతి విప్పి, మూతిని వెడల్పుగా లాగాడు. లాగినకొద్దీ సంచీ మూతి పెద్దది అవుతూనే వుంది. ఇకనేం రాకసుడి తలలని దాంట్లో పెట్టి మళ్లీ మూతి బిగించాడు. సంచీలోంచి రాకసుడి తలలమీద వున్న పాములు ఇంకా బుసలు కొడుతూనేవున్నై.

మరికొంతసేపటిలో ధీరవర్మడు సంచీతో సహా వృద్ధుడూ వాళ్లు వున్నచోటికి చేరుకున్నాడు. "రాకసుడితలల్ని నువ్వునరికినా, ఇంకో ఆరునెలలదాకా ప్రాణంవుంటుంది.



"చాలా ప్రమాదం జరుగుతుంది. ఇంకో ఆరునెలల వరకూ ఆ తలలకి ప్రాణం వుంటుంది. ప్రాణం వుండగా వాటివంక చూసిన వాళ్లు ఆపళంగా రాయి ఐపోతారు. నీవు అంతగా చూడదలుచుకుంటే యింకో ఆరునెలలు ఓపికపట్టు" అన్నాడు.

"దానివంక చూస్తేనే రాయి అయిపోయే లాగైతే, మరి నువ్వు ఆ రాక్షసుడిని చంపి తలలు ఎట్లా తేగలిగావు? నీదంతా చూడబోతే దొంగవేషంలావుంది. ఏమైనాసరే ఆ తలలని చూడవలసిందే" అని పట్టుబట్టారు మంత్రులు. రాజు కూడా "నిజం. నిజం. తలలని చూపి తీరవలసిందే. లేకపోతే మళ్లీ వెళ్లిపోవలసిందే" అన్నాడు.

వృద్ధుడూ, వృద్ధుడి మేనకోడలుకూడా రాజుకి ఎన్నోవిధాల చెప్పి చూశారు. "ఎందుకు అనవసరంగా పట్టుబట్టుకు కూర్చుంటారు? ఏ నిమిషాన ఆ తలలవంక మీరు చూస్తే ఆ నిమిషాన మీరందరూ ఒక్కసారిగా రాళ్లు అయికూచుంటారు" అని ఎంతో నచ్చచెప్పారు.

వీలులేదన్నారు మంత్రులు. రాజు అంతే అన్నాడు. "సరే మీ కర్మం. మేము చెప్పవలసిందంతా చెప్పాం. వినకపోతే మేమేం

చేస్తాం" అంటూ వృద్ధుడు మళ్లీ ధీరవర్మ్మడి నెత్తినా, తన మేనకోడలినెత్తినా మాయ కిరీటాలు వుంచాడు. వాళ్లు మాయమై పోయి, ఆచోట గాలిలో రెండు కిరీటాలు మాత్రం నిలిచినై.

ఇది చూచేసరికి దర్బారులో వున్నవాళ్లంతా ఆశ్చర్యపోయారు. అప్పుడు వృద్ధుడు అన్నాడు "ఆఖరిసారిగా నేనుచెబుతున్నాను. ఈ తలలని చూచితీరాలని మొండిపట్టు వదలండి. కాదు కూడదంటే మరొక క్షణంలో మీరు నిలుచున్నచోట్ల మీబదులు రాతివిగ్రహాలు మిగులుతై."

ఇంత చెప్పినా వాళ్లకి నమ్మకం కలగ లేదు. వాళ్లు ముగ్గురూ చేరి తమని మోసం చేస్తున్నారని అనుకున్నారు. "రాళ్ళుగా మారిపోయినాసరే ఆ తలలని చూచితీరాలి సిందే" అన్నారు అందరూ ఒక్కసారి.

ఇక చెప్పి లాభంలేదని తెలుసుకున్నాడు వృద్ధుడు. సంచిని అక్కడ నేలమీదవుంచి ధీరవర్మ్మడితో చెప్పాడు—"నేను బయటికి పోతున్నాను. ఇదివరకు నే చెప్పిన సంగతులన్నీ జ్ఞాపకం వుంచుకుని సంచీమూతి విప్పు. వాళ్ళు చూసిన తర్వాత మళ్లీ దానిని సంచీలో బిగించి నన్ను కేకవెయ్యి. వస్తాను" అని. సరే నన్నాడు ధీరవర్మ్మడు. వృద్ధుడు సంచిని అక్కడ వదిలి సింహద్వారం దగ్గిరికిపోయి వీధివైపుకు చూస్తూ నుంచున్నాడు.

"మామా, సెలవు" అంటూ ధీరవర్మ్మడు తన డాలులో సంచిని చూస్తూ మూతి విప్పాడు. మూతి విప్పి విప్పటంతోటే దాంట్లోంచి రాక్షసుడితలలుఎగిరి నేలమీద పడినై. వెంటనే దర్బారులో వున్నవాళ్ళు ఎక్కడివాళ్లక్కడ రాతివిగ్రహాలైపోయారు.

ఆ తర్వాత, ధీరవర్మ్మడు తల్లిని కలుసుకుని అంతా చెప్పాడు. ఆమె చాలా సంతోషించింది. వృద్ధుడి మేనకోడలు ధవళకుమారిని యిచ్చి తన కొడుక్కు పెళ్లి చేసింది. ప్రజలంతా సంతోషించారు కొత్తరాజునుచూసి. [అయిపోయింది]



# చందమామ
## పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము

1. మగతనము
4. స్వప్నము
6. సెజాను
7. భాగము
8. పెద్దబూర
10. ఒక ఆట పేరు
12. పంద్రెండు రాసులలో ఒకటి
13. ఉపాధ్యాయులు




### నిలువు :

1. దీపావళి నాడు వెలిగించవచ్చు
2. చీకటిలో ప్రకాశించెడి పురుగు
3. ప్రపంచము
5. నీళ్లు వేయుటకు ఉపయోగింతురు
8. నీటిలో ఈదెడు పక్షి
9. నీళ్లు దీనిగుండా పోతవి
11. వీటితో నూనె తయారు చేయవచ్చును

## ముగ్గులు



ఆర్. జానకి, ఏలూరు



యస్. పద్మావతి, బళ్లారి




# పిల్లల పెంపకం

## ఆ టలు

పిల్లలు ఆటలాడటం ఊరికే తమాషాకోసం కాదు. ఆటలాడటంవల్ల ఎంతో ఉపయోగ మున్నది. శరీరం ఆరోగ్యంగా వుంటుంది, జీర్ణశక్తి వృద్ధి అవుతుంది, బుద్ధిబలం వికసిస్తుంది. తోడి పిల్లలతో కలిసిమెలిసి నేస్తంగా ఉండటం అలవాటవుతుంది.

ఊయలలో పడుకొనివున్న పసిపాప సయితం ఎన్నో ఆటలాడతాడు. పైన వేలాడకట్టిన చిలకల పంజరం చూచి నవ్వుతాడు; చేతులతోనూ కాళ్లతోనూ సైకిలు తొక్కుతాడు!! పిల్లలు పెరిగి పెద్దకావడానికి సహాయపడే అసలు రహస్యం వారు ఆడే ఈ ఆటలే! కనుకనే ఏ వయసు పిల్లలకు తగిన ఆ ఆటలు ప్రకృతిలోనే ఏర్పడివున్నాయి.

చిన్న పిల్లలకు ఆటవస్తువులు బొమ్మలు. కొంచెం ఎదిగినవాళ్లు దాగుడు మూతలు, దొంగను పట్టుకోవటం మొదలయిన ఆటలంటే సరదా పడతారు. పెద్ద ఐతే బంతులాటమీద మోజుపడతారు. ఇంకా ఎదిగిన పిల్లలకు ఉప్పట్లు, బల్ కిత్ వంటి పెద్ద ఆటలున్నాయి. పిల్లల ఆరోగ్యంకోసం మన పూర్వులు కొన్నివందల రకాల క్రీడలు ఏర్పరిచివున్నారు. ఇటీవల కాలిబంతి ఆట, క్రికెట్ మొదలయిన కొత్త రకాలుకూడా వచ్చాయి.

పిల్లలకు తిండి, బట్ట ఎంత ముఖ్యమో, శరీర పరిశ్రమ అంతకంటె ముఖ్యం. కనుక, ఏ ఆటలాడటానికయినా, ప్రతి గ్రామంలోనూ పిల్లలకోసం ఆటస్థలం ఒకటి కేటాయించడం చాలా అవసరం.

---

మీ పెద్దమ్మ

---



ఈ కుందేలు ఇంటినుంచి బయలుదేరి, అలా తిరుగుతూ తిరుగుతూ చాలదూరం వచ్చేసింది. మళ్లీ యింటికి ఎలా పోవాలో పాపం దానికి తెలియలేదు. మీరు దారి చూపించి జాగ్రత్తగా దాన్ని యింటిదగ్గరకు చేర్చండి చూదాం.

పజిలుకు




జవాబు

★

11-వ పేజీలోని చిక్కు బొమ్మలకి జవాబు:
4, 8 నెంబర్లుగల బొమ్మలు రెండూ ఒక్కమాదిరివి

★



# విజ్ఞానంలోని గమ్మత్తులు

తొండను ఎప్పుడయినా చూచారా? — అది ఈ నిమిషంలో ఒక రంగు, మళ్లీ నిమిషంలో మరొక రంగుతో చాలా చిత్రంగా కనపడుతుంది. ఎరుపు, పచ్చ, నీలం— ఇటువంటి రంగులన్నీ దాని ఒంటిమీద అగపడతయి. ఈ రంగులు మనం స్వయంగా ఇంట్లో చేసుకోవచ్చు, ఎలా అంటారా?—

పసుపు, సున్నం, మూడు గాజుగొట్టాలు, నీళ్లు, నిమ్మపండు—ఇవి మనకు కావలసిన సామగ్రి. ఒక గాజు గొట్టంలో నీళ్లు పోసి అందులో కొంచెం పసుపు కలిపి, ఒక దగ్గిర ఉంచాలి. రెండో గొట్టంలో సున్నపు నీళ్లు పోసి, అవి ఒకచోట పెట్టాలి. కొంత సేపటికి, పసుపునీళ్లూ సున్నపునీళ్లూ చక్కగా తేరుకొంటాయి. అప్పుడు మూడో గాజుగొట్టం తీసికొని, అందులోవి కొన్ని నీళ్లు, ఇందులోవి కొన్ని నీళ్లు అందులో పోసి తమాషా చూడండి. ఆ నీరూ ఈ నీరూ కలియగానే, వాటి అసలు రంగులు పోయి, కొత్తగా అందమైన నారింజపండు రంగు బయలుదేరుతుంది. ఇది చిత్రం కాదూ!

మరొక గమత్తు: మీదగ్గిర నిమ్మపండు ఉన్నదికదా? అది రసం పిండి, ఆ నిమ్మ రసం అయిదారు చుక్కలు ఇప్పుడు తయారయిన నారింజరంగు ద్రావకంలో వేసినట్టయితే. నారింజరంగు మాయమై, మళ్లీ మామూలు పసుపు రంగుగా మారి పోతుంది.

ఈ మేజిక్కు చూచినవాళ్లందరూ బలే బాగా వుందని సంతోషించి ఆశ్చర్యపోతారు.




ఈ బొమ్మకి ఎక్కడెక్కడ ఏయే రంగులు వెయ్యాలో ఆలోచించి అట్లా రంగులువేసి మీదగ్గిర వుంచుకోండి. వచ్చేనెల (మే) చందమామ అట్టమీద ఈ బొమ్మను సరియైన రంగులతో మేము వేస్తాం. అప్పుడు మీరు రంగులువేసిన బొమ్మని దానితో పోల్చుకోండి.



స్కూలు పిల్లలతో ముచ్చటలాడుతున్న మన గవర్నర్ జనరల్ 'రాజాజీ'

వేసవికి

## హాయిగొలిపే దుస్తులు

కావాలి సుమా.

★

మీకు, మీ పిల్లలకు

ఆనందమూ, సొగసూ

యిచ్చే

## బి.డి.యం.కంపెనీ

[కె.హెచ్. ష్యామారావు అండ్ సన్సు]

బెంగుళూరు వారి

# SAMSONS DRESSES

## మన్నిక గల దుస్తులను

*నిత్యమూ వాడండి*

★

ఆర్గనైజర్లు :

ఆంధ్రకు :

జి. వెంకటప్పయ్యా అండ్ సన్స్,

గాంధినగర్, బెజవాడ.

నిజాముకు :

ఫ్రెండ్స్ ఎంపోరియం,

27, ఘాన్మండి రోడ్, సికింద్రాబాదు.



## డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY - 4

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి వూరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయుండి.

**చందమామ ఆఫీసు,**

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.

# ఆంధ్రజ్యోతి

## ఉగాది సంచిక



తుటుంబరావు, రామకృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, మునిమాణిక్యం, చలం, ధనికొండ, సారిస్, మా. గోఖలే, పి. రామచంద్రమూర్తి, నార్ల, మున్నగు ప్రముఖుల ఉత్తమ రచనలతో



యం. టి. వి. ఆచార్య, యస్. వి. యస్. రామారావు, తేజోమూర్తుల కేశవరావు, వి. రామారావు, పి. నరసింహమూర్తి, మా. గోఖలే మున్నగు చిత్రకారుల అందమైన ఏకవర్ణ, త్రివర్ణ చిత్రాలతో



**200 పేజీలతో ఎంతో ఆకర్షవంతంగా**
**ఉగాదినాడు వెలువడుతోంది**



మీ కాపీకొరకు నేడే జాగ్రత్తపడండి.

సంచిక వెల రు. **1-0-0**

**ఆంధ్రజ్యోతి కార్యాలయం,**
**37, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1.**

Printed and Published by B. NAGI REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors ; CHAKRAPANI and K. RAJA RAO.

